# లోకోక్తికథలు.





ఉభయభాషాప్రవీణ,

చింతలపూఁడి శేషగిరిరావు.

( భాషాకుటీరము. )

ఓమ్.

# లోకోక్తికథలు.



ఉభయభాషాప్రవీణ,

చింతలపూఁడి శేషగిరిరావు.

(భాషాకుటీరము)

సహాయోపాధ్యాయుఁడు,

ఎడ్వర్డు బోర్డుహైస్కూలు, పామ్మూరు.



వెల ఆఱణాలు.

# తొలిపలుకు.

పాఠకమహాశయా!

ప్రథమ ప్రయత్నమగు 'ప్రబంధోపకథావళి' ప్రథమ ముద్రణంపుఁ బ్రతులన్నియు నలఁతి కాలమున నమ్ముడువోవ సాయమొనర్చిన ప్రధానోపాధ్యాయులకును విద్యాశాఖాధికారులకును వందనములు. ఇయ్యది ద్వితీయగ్రంథము. ఇందాంధ్రమునఁగల కొన్ని లోకోక్తులనేరి వాని యుత్పత్తికారణములగు కథల వ్రాసితి. లోకోక్తులును జాతీయములును వాఙ్మయాభివృద్ధిసూచకములు. జనపరంపరయం దీసామెతలు వాడుకయందుండునుగాని అవియేల వాడుకలోనికి వచ్చెనో కొందఱకగ్రాహ్యము.

పొత్తము ప్రాథమిక విద్యాభ్యాసకుల కుద్దేశింపఁబడినదిగాన ప్రథమమీఁది గసడదవాదేశముఁగాని, ద్రుతంబుపై సరళాదేశముఁగాని సంధికార్యములుఁగాని సంతగఁ బరిగణింపఁ బడవయ్యె. ఇదియే కారణముగ సర్థానుస్వారములు సిద్ధములు వాడితిఁగాని సాధ్యములంతగఁ బాటింపనైతి. ప్రతి తరగతియందును బురాణములలోనివియుఁ, బ్రబంధములలోనివియుఁ గథలను రోకంటి పాటగఁ జదివి విసుకెత్తు బాలురకీకథలుత్సాహజనకములని యెంచెద. కథలు హాస్యరస ప్రధానములుగాన విద్యార్థులకే కాక తదితరులకును పఠనార్హములు. గుణాగుణ విమర్శనము విబుధులకు వదలి విరమించెద.

ఇట్లు,

పొన్నూరు,
28-12-32.

విబుధవిధేయుఁడు,
గ్రంథకర్త.

# విషయానుక్రమణిక.

| నెం. | విషయము. | పుట. |
|---|---|---|

| నెం. | విషయము. | పుట. |
|---|---|---|
| 18 | దొంగా! చెయికలచెదవు సుమా! | 38 |
| 19 | చిక్కెరా! మిడుతంభొట్లు. | 39 |
| 20 | వచ్చినపని వాకిటనే అయినది. | 42 |
| 21 | చెవిటికి సంకూదుట. | 44 |
| 22 | చినరామన్న పెదరామన్న. | 46 |
| 23 | గుడిపూడి జంగాలు. | 48 |
| 24 | మక్కికి మక్కీ నకలు. | 49 |
| 25 | నూటికి సర్దారు. | 51 |
| 26 | నవాబు దర్జా. | 57 |
| 27 | గుడ్డిదర్బారు. | 58 |



శ్రీః.

అవిఘ్నమస్తు.

# లోకోక్తి కథలు.

## ౧. బాదరాయణసంబంధము.

ఒకానొక గ్రామమున ఒకబ్రాహ్మణుఁడును ఆతని భార్యయు కలరు. ఈదంపతు లిరువురును అమాయికులు. కల్ల కపట మెఱుఁగరు. భర్త బ్రాహ్మణవృత్తిచే నార్జించిన స్వల్పద్రవ్యముచే జీవనము గడపుచుండెను. భార్య యింటి పనులు నెఱవేర్చుకొనుచు ఇతరజోక్యము లేకుండెను. ఒక నాఁడు విప్రుఁ డరుఁగుపై కూర్చుండి విస్తళ్లు కుట్టుకొనుచుండెను. భార్య వంటింటిపనులు చక్కఁబెట్టుకొనుచుండెను.

కొంత సేపటికి గ్రామాంతరమునుండి మఱియొక భూసురుఁ డొకశకటమును దోలుకొని ఆబ్రాహ్మణుని యిల్లు సమీపించెను. ఆతని బండిచక్రములు రేఁగుకఱ్ఱతో చేయఁబడినవి. ఆతఁడు బండిదిగి యెద్దులనువిప్పి యీబ్రాహ్మణుని యింటి ముంగల గల రేఁగుచెట్టునకు కట్టివైచెను. అంతటితోనాగక

యొకాయొకని లోపలికిపోయెను. దొడ్డిలోని నూతికడకేఁగి, పాదప్రక్షాళనముజేసి, వంకెపైనున్న అంగవస్త్రముతీసి, కాళ్లు తుడిచికొనెను. అరుఁగుపై నాసీనుఁడై తానును నొకవిస్తరి గుట్ట మొదలుపెట్టెను.

వంటపని పూర్తియైనపిమ్మట బ్రాహ్మణి భర్తను భోజనమునకు లెమ్మనెను. ఆతఁడును అతిథియు స్నానములుజేసి జపముమొదలుపెట్టిరి. కొంతసేపటికి వడ్డనయుపూర్తియయ్యెను. బ్రాహ్మణు లిరువురు తృప్తిగ భుజించిరి. ఇంతదనుక నానూతన పురుషుఁడు భర్తవైపు చుట్టమని భార్యయు, భార్యవైపు బంధుగుఁడని భర్తయు ననుకొనుచుండిరి. కాన నిరువురియందొక్కరును అతనిని 'మీరెవర'ని ప్రశ్నించుటకు సాహసింపరైరి. భోజనములు పూర్తియయ్యెను. భూమిదేవత లిరువురును మంచములపై పరుండి నిదురించిరి. ఇంటియజమానుఁడు కొంచెము ముందుగలేచి భార్య నీతఁడెవ్వఁడని ప్రశ్నించెను. ఆమెయు నాతనివిషయము తనకిసుమంతయైన తెలియదనెను.

ఇట్లు లొండొరులు సంభాషించుకొనిన పిమ్మట ఈతఁడెవ్వఁడో క్రొత్తమనుష్యుఁడని వారు తెలిసికొనిరి. కొంత తడవునకు క్రొత్తబ్రాహ్మణుఁడు మేల్కొనెను. అంతట ఇంటియాతఁడు 'మీరెవ్వరు? మీకును మాకునుగల సంబంధమేమి?' అని అడిగెను. వెంటనే యాయతిథి:—

"శ్లో॥ అస్మాకం బదరీచక్రం యుష్మాకం బదరీతరుః
బాదరాయణసంబంధం యూయంయూయం వయంవయమ్॥

నాబండివి రేఁగుచక్రములు. మీయింటిముందు రేఁగు చెట్టుకలదు. రేఁగుచెట్టునకు బదరీవృక్షమను పేరుకలదు. ఇదియే బాదరాయణసంబంధము. మీరుమీరే మేముమేమే" యనిచెప్పి, యెద్దులను బండికి పూన్చుకొని, తనదారిని వెడలి పోయెను.

-o-

## ౨. అయితే ఆరుక కాకపోతే కంది.

పూర్వమొక కుగ్రామమున ఒకకాఁపును ఆతని యిల్లాలును గలరు. వారిరువురును ఈకాలపు మనుష్యులుగారు. ప్రపంచజ్ఞానహీనులు. వారికి తల్లిదండ్రులను మించివారని పించు నొక కుమారుఁడు గలఁడు. విత్తొకటి నాటిన మొక్క యొకటి మొలచునా? భర్త వ్యవసాయము చేయుట, భార్య గృహకార్యములొనర్చుట, పుత్రుఁడు పశువులమేఁపుట. ఇవి వారి నిత్యకృత్యములు.

ఒకసంవత్సర మాకాఁపు ఒక చేనియం దారుకపైరును మఱియొక చేనియందు కందిపైరునుపెట్టెను. ఆరుక కోఁతకు వచ్చెను. కంది పూత పిందెలతో కన్నులపండువొనరించు చుండెను. ఆకర్షకుఁ డొకదినమున ఆరుకచేను కోయుటకు ఇరు వదిమంది కూలివాండ్రను కుదిర్చెను. కాని ఆపని కంతమంది పనివాండ్రు అనవసరము. లోకవ్యవహారము తెలియని మూ ఢాగ్రేసరుఁ డగుటవలన ఆతఁ డట్లొనర్చెను. ఉదయమున

యొకాయొకిని లోపలికిపోయెను. దొడ్డిలోని నూతికడకేగి, పాదప్రక్షాళనముజేసి, వంకెపై నున్న అంగవస్త్రముతీసి, కాళ్లు తుడిచికొనెను. అరుఁగుపై నాసీనుఁడై తాను నొకవిస్తరి గుట్ట మొదలుపెట్టెను.

వంటపని పూర్తియైనపిమ్మట బ్రాహ్మణి భర్తను భోజనమునకు లెమ్మనెను. ఆతఁడును అతిథియు స్నానములుజేసి జపము మొదలుపెట్టిరి. కొంతసేపటికి వడ్డనయుపూర్తియయ్యెను. బ్రాహ్మణు లిరువురు తృప్తిగ భుజించిరి. ఇంతదనుక నానూతన పురుషుఁడు భర్తవైపు చుట్టమని భార్యయు, భార్యవైపు బందుగుఁడని భర్తయు ననుకొనుచుండిరి. కాన నిరువురియందొక్కరును అతనిని 'మీరెవర'ని ప్రశ్నించుటకు సాహసింపరైరి. భోజనములు పూర్తియయ్యెను. భూమిదేవత లిరువురును మంచములపై పరుండి నిదురించిరి. ఇంటియజమానుఁడు కొంచెము ముందుగలేచి భార్య నీతఁడెవ్వఁడని ప్రశ్నించెను. ఆమెయు నాతనివిషయము తనకిసుమంతయైన తెలియదనెను.

ఇట్లు లొండొరులు సంభాషించుకొనిన పిమ్మట ఈతఁడెవ్వఁడో క్రొత్తమనుష్యుఁడని వారు తెలిసికొనిరి. కొంత తడవునకు క్రొత్తబ్రాహ్మణుఁడు మేల్కాంచెను. అంతట ఇంటి యాతఁడు 'మీరెవ్వరు? మీకును మాకునుగల సంబంధమేమి?' అని అడిగెను. వెంటనే యాయతిథి:—

"శ్లో॥ అస్మాకం బదరీచక్రం యుష్మాకం బదరీతరుః
బాదరాయణసంబంధం యూయంయూయం వయంవయమ్॥

నాబండివి రేఁగుచక్రములు. మీయింటిముందు రేఁగుచెట్టుకలదు. రేఁగుచెట్టునకు బదరీవృక్షమను పేరుకలదు. ఇదియే బాదరాయణసంబంధము. మీరుమీరే మేముమేమే" యనిచెప్పి, యెద్దులను బండికి పూన్చుకొని, తనదారిని వెడలి పోయెను.

## ౨. అయితే ఆరుక కాకపోతే కంది.

పూర్వమొక కుగ్రామమున నొకకాఁపును ఆతని యిల్లాలును గలరు. వారిరువురును ఈకాలపు మనుష్యులుగారు. ప్రపంచజ్ఞానహీనులు. వారికి తల్లిదండ్రులను మంచివారనిపించు నొక కుమారుఁడు గలఁడు. విత్తొకటి నాటిన మొక్క యొకటి మొలచునా? భర్త వ్యవసాయము చేయుట, భార్య గృహకార్యములొనర్చుట, పుత్రుఁడు పశువులమేఁపుట. ఇవి వారి నిత్యకృత్యములు.

ఒకసంవత్సర మాకాఁపు ఒక చేనియం దారుకపైరును మఱియొక చేనియందు కందిపైరునుపెట్టెను. ఆరుక కోఁతకు వచ్చెను. కంది పూత పిందెలతో కన్నులపండువొనగించుచుండెను. ఆకర్షకుఁ డొకదినమున ఆరుకచేను కోయుటకు ఇరువదిమంది కూలివాండ్రను కుదిర్చెను. కాని ఆపని కంతమంది పనివాండ్రు అనవసరము. లోకవ్యవహారము తెలియని మూఢాగ్రేసరుఁ డగుటవలన ఆతఁ డట్లొనర్చెను. ఉదయమున

పెందలకడనే ఆతఁడు కూలీలను దీసికొని పొలముజేరెను. వారును కోఁత ప్రారంభించిరి. జాముప్రొద్దగు నప్పటికే కోఁత పూర్తియయ్యెను. కూలివాండ్రకు మాత్రము రోజుకూలి పూర్తిగ నియ్యవలెను. అట్లిచ్చిన నష్టమనియెంచి మనకాఁపు పనివాండ్రను కందిచేనికి తీసికొనిపోయెను. కోఁతప్రారంభింపుఁడనెను. వారికేమినష్టము? గుడినుండు గంటపోయిన నంబికేమి ప్రమాదము? వారు కోఁత ప్రారంభించి పుట్టెడు కందులు పండు పైరు పూఁటమాత్రమున నాశన మొనరించిరి.

కాఁపును తా నొనర్చిన లాభసాటిబేరమునకు తనలో తా నానందించుకొనుచు ఇంటికేగెను. పనివాండ్రకీయవలసిన కూలి నిచ్చిపంపెను. భార్యతో జరిగిన వృత్తాంత మంతయు పూసగుచ్చినట్లు చెప్పెను. భార్యయు మిగుల సంతసించి " నేనును మీకొక లాభము గలుగ జేసితిని. మీకును అబ్బాయికిని ఒక మంగలి క్షౌరముజేయునట్లును ఆతని కొక్క అణా యిచ్చునట్లును ఏర్పాటుచేసితిని. అబ్బాయి క్షురకర్మముజేయించుకొని చద్దియన్నము గుడిచి పశువుల దోలుకొని పోయెను. ఎంతసేపు కనిపెట్టుకొని యున్నను మీరు రారైతిరి. మంగలికి అణానిచ్చిన నష్టమనియెంచి నేనే క్షురకర్మము జేయించుకొంటిని చూడుఁడ " ని శిరముపై నున్న ముసుఁగు తొలఁగించెను. భార్య తెలివితేటలకు భర్తయు మిగుల సంతసించెను. అవివేకులగు నీ అమాయికపు దంపతుల వలననే 'అయితే ఆరుక కాకపోతే కంది ' అనుసామెత లోకమున వాడుకలోనికి వచ్చెను.

# 3. పెండ్లికుమారుఁ డీతఁడే కాని పోఁగు లీతనివి కావు.

వెల్లటూరను గ్రామమున వెంకయ్య యను యువకుఁ డొకఁడు గలఁడు. ఈతనికి అధికప్రసంగము మెండు. పిలువని పేరంటమున కేగుట ఈతని స్వభావము. గిల్లి జగడమాడుట యితని నైజగుణము. గ్రామమున ఎవరింట వాద్యము మ్రోగినను అదియ తనకాహ్వానముగ నెంచి పప్పుకూటికి పరుగిడువాఁడు.

ఒకప్పుడా గ్రామమున ఒక బ్రాహ్మణునిఇంట వివాహము జరుగఁబోవుచుండెను. పెండ్లికుమారుఁడు కొంచెము కురూపియగుటవలన వయసు ముదిరినపిమ్మటగాని సంబంధము కుదురదయ్యెను. వరుఁడు ఎరవుసొమ్ములను అద్దెదుస్తులను ధరించి పెండ్లికి సిద్ధమయ్యెను. పెండ్లివారు పెండ్లికి తరలిపోవుచుండిరి. వెంకయ్య తమవెంటవచ్చిన నేదియో యొక అల్లరి జరుగక మానదని వారతనిని పిలువకయే బయలుదేరిరి, కాని అతఁడెట్లో యీ విషయమును పసికట్టి మార్గమధ్యమున పెండ్లిబండ్లను కలిసికొనెను. ఒకబండియందు కూర్చుండి తనకు సహజమగు వాచాలతను గనుపఱచుచు వెడలుచుండెను. కొంతసేపటికి వారు తమ గమ్యస్థానము జేరిరి. ఊరిబయట విడిసి వరపూజకొఱకు వేచియుండిరి. "డబ్బునివ్వనివాఁడు ముందుగ పడవనెక్కి" నట్లు తనకేమియు సంబంధములేకున్నను మన వెంకయ్య పెండ్లికుమారునిప్రక్క నాసీనుఁడయ్యెను.

ఇంతలో పెండ్లికుమార్తె తండ్రియటకేతెంచి 'పెండ్లి కుమారుఁడీతఁడేనా?'యని ప్రశ్నించెను. వెంకయ్యఅందఱికంటె మొనగానివలె తత్క్షణమే 'పెండ్లికుమారుఁ డీతఁడేకాని పోఁగు లీతనివికా'వని ప్రత్యుత్తరమిచ్చెను. కన్యాదాత, ఎద్దియో యాలోచించుకొనుచు వెడలిపోయెను. వెంకయ్య అట్లు జవా బిచ్చినందుకు మిగిలినవారంఱు అతనిని మందలించిరి.

మఱికొంతసేపటికి అత్తగారటకేతెంచి వెనుకటిసలె ప్రశ్నింప, 'పెండ్లికుమారుఁడీతఁడే పోఁగులును ఇతనివే' అని వెంకయ్య వాక్రుచ్చెను. ఆమెయు కొంచెము సందేహముతో వెడలిపోయెను. పెండ్లిపెద్దలు, "వారు పెండ్లికుమారునిసంగతి యడుగ నీకు పోఁగులసంగతి యేలయని" వెంకయ్యను కోపించిరి. కొంతతడవునకు వరుని బావమఱఁది యొకఁడువచ్చి పూర్వము వలె ప్రశ్నించెను. వెంకయ్య ఊరకొను స్వభావముగలవాఁడు కాదుగాన "పెండ్లికుమారుఁ డీతఁడేకాని పోఁగులసంగతి నాకు తెలియ" దనెను. శ్యాలకుఁడు, మారుమాటాడక వెడలి పోయెను. పెండ్లికివచ్చిన వారందఱు వెంకయ్యను 'ఈయన వసరపు ప్రసంగము నీకెందుల'కని గద్దించిరి.

అట్లే మరియొకరువచ్చి ప్రశ్నింప, నతఁడు 'నాకు పెం డ్లికుమారునిసంగతి తెలియదు పోఁగులసంగతి తెలియదు'పొమ్మ నెను. అటనున్నవారు, 'పెండ్లికిపోవుచు పిల్లిని చంకబెట్టుకొని పోయిన'ట్లు ఈతని రానిచ్చుటయే తమ తప్పిదమనుకొని, యెట్లో వివాహముకానిచ్చి యింటికేగిరి.



# ౪. దబ్బచెట్టుకు మడిబట్టలు గట్టుట.

గోదావరీమండలమున పేరూరను అగ్రహారముగలదు. ఆగ్రామము కొబ్బరి, పనస, నారింజ, మొదలగుతోటలకు ప్రసిద్ధిచెందినది. ఆప్రాంతములు మిగుల సారవంతమైనవి. కావున ఊరివెలుపలనేకాక, ఊరియందును దబ్బ నిమ్మ మొదలగు వృక్షములు బాగుగ పెఱిగి విరియఁగాయును. ఆయూరి యందొక నిరుపేదయగు విప్రుఁడును, ఆతనిభార్యయు గలరు. వారొక కుటీరమునందు నివసించుచుండిరి. వారిఇంటివెనుక నొక దబ్బచెట్టు కలదు. అది బాగుగ ఫలించుటవలన వారికి సాలునకు ఏబదిరూప్యములు లభించుచుండెను. అదియే వారికి జీవనాధారము.

ఆదంపతు లిరువురు మిగుల పూర్వాచారపరాయణులు. ఆచారమునందు భర్తకంటె భార్యయు, భార్యకంటె భర్తయు, మిన్నగ నుండవలయునని వారిరువురు సదా ప్రయత్నించుచుం దురు. ఒక సంవత్సరము వారి దబ్బచెట్టు బాగుగ కాచి ఫల భారమున విన్రమ్రమై యుండెను. పాపము! వారి పెరటిచుట్టును దిట్టమగు గోడయైనలేదు. సగమువఱకు విరిగి శిథిలమైన మట్టిగోడలే యాధారమై యుండెను. ఎట్లైనను వారు తమకు ముఖ్యజీవనాధారమగు నావృక్షమును ప్రాణపదముగ కాపాడు కొనుచుండిరి. దబ్బపండ్లు బాగుగ పక్వమునకువచ్చెను. ఒకటి రెండు దినములలో వానినమ్మి సొమ్ముచేసికొనవలెనని బ్రాహ్మ ణుఁ డెంచుచుండెను.

ఒకనాఁటిరాత్రి ఆభూసురుఁడు పరుండఁబోవుచు భార్యతో "దబ్బకాయల నింతదనుక ప్రాణమొకయెత్తుగ కాపాడితిమి. రేపు తప్పక విక్రయించవలెను. ఈరాత్రి 'వానిని జాగ్రత్తగ చూచుచుండుము. లేకున్న 'ఈనగాచి నక్కలపాలు చేసినట్లగు'ననెను. వెంటనే భార్య " ఏలసందేహించెదరు ? కాయలు చోరులపాలు గాకుండ దబ్బచెట్టునకు మడిబట్టగట్టితిని. మడిబట్ట తాకిగదా! ఎవరైన కాయలు కోయవలెను? చూచి చూచి యట్టి యకృత్యమే ఆచారహీనుఁడొనర్చును? మైమఱచి నిదురింపుఁడ" నెను. భర్తయు ఆపెమాటలకు సంతుష్టుఁడై పరుండెను.

ఆదారినిబోవు దుర్మార్గుఁడొక్కఁడు, ఈసంభాషణ మంతయువిని, వారిరువుర నిదురపోనిచ్చి, ఆకాయలన్నియు ఊఁచముట్టుగ నపహరించెను. మఱునాఁటి రేపకడ వారు పెరటి లోనికిపోయిచూడ, చెట్టున ఒక్కకాయయైన గన్పడదయ్యెను. దబ్బకాయలపహరించుట యెట్లున్నను, మడుగువస్త్రముతాకిన ఆచోరునిసాహసకృత్యమును గుఱించి వారు చాలతడవు విచా రించిరి.



# ౫. రెడ్డివచ్చె మొదలాడు.

గుంటూరు జిల్లాయందు పల్నాడను తాలూకా గలదు. అందు, కారెంపూడి యను పట్టణము గలదు. అది మిగుల ప్రసిద్ధి చెందినది. పూర్వ మిచ్చటనే పల్నాటివీరులు యుద్ధ మొనర్చి, తమ యవక్రి పరాక్రమమును లోకమునకు చాటిరి. కవి సార్వభౌముఁడగు శ్రీనాథుఁడు సహితము 'కారెమపూడి పట్టణము కాశిసుమీ కనుగొన్న వారికి ' అని యీ పట్టణ మును మిగుల కొనియాడెను. ఇయ్యది రెడ్లకు నివాసస్థానము.

ఈ రెడ్లు ధనధాన్యసమృద్ధిగలిగి, ఎల్లప్పుడును పాడిపం టలతో తులదూఁగుచుందురు. వ్యవసాయము వీరి ముఖ్య వృత్తి. వీరు విశాలవక్షములును, కండ్రములు దేలిన శరీర ములును గలిగి సదా ఆరోగ్యవంతులై యుందురు. వ్యవ సాయఁపు తరుణమందు వారు త్రుటికాలమైనను వృథాసేయరు. కాని, విశ్రాంతి సమయము లందప్పుడప్పుడు, కథలు, వీధి నా టకములు, వినుటయందు కాలము పుచ్చుచుందురు. ఈ ప్రాంతముఁలందు పిచ్చికుంటవాండ్రను నొకజాతివారు గలరు. వీరు మంచి కథకులు. పంబజోడను నొకవిధమగు వాద్య మును మ్రోగించుచు, కత్తి డాలు మొదలగు చిహ్నములు ధరించి, పల్నాటివీరచరిత్రమును కథగ జెప్పుచుందురు. అచ టిరెడ్లు, ఈ కథయనిన చెవిగోసికొందురు. కారెంపూడి గ్రామమున ఈ కథాకాలక్షేపము తఱచుగ జరుగు చుండును.

సామాన్యముగ ప్రొద్దు కుంకగనే కథ మొదలుపెట్ట బడును. పంబజోడుపై దెబ్బకొట్టగనే యేకొలఁదిమందియో గుమికూడుదురు. అంత కథా ప్రారంభము జరుగును. కథ కొంతవఱకు జరుగగనే యొకరెడ్డి పెద్దతలపాగను ధరించి, కిఱ్ఱు చెప్పులు తొడుగుకొని, నోటియందు పొగచుట్ట పెట్టుకొనివచ్చి దుప్పటి చుట్టచుట్టి క్రిందవైచి, దానిపై కూర్చుండును. అంత ప్రేక్షకులందొక్కఁడు 'సుబ్బిరెడ్డిగారి రామిరెడ్డి వచ్చెను. కథ మరల మొదలు పెట్టుఁడ' నును. అంత నాకథకుఁడు చెప్పుచున్న కథ నాపి మరల మొదటికివచ్చును. రెండు మూఁడు వాక్యము లగునప్పటికి మరల నొకరెడ్డి అట్లేవచ్చును. ఆఁ! మన బసివి రెడ్డిగారి అంకిరెడ్డి తమ్ముఁడు ఓబులురెడ్డి వచ్చెను. కథమరల ప్రారంభింపుఁ డందురు. అట్లే కథ మరల ప్రారంభింపఁబడును. ఇట్లు తెల్లవారుదనుక రెడ్లు వచ్చుచుంటయు 'రెడ్డివచ్చె మొదలాడు' మనుటయు జరుగుచు కథ యెప్పటికిని పూర్తిగా కుండును.

## ౬. మేఁకపోతుగాంభీర్యము.

సామాన్యముగ మానవులందు ఏదియేని యొకదీక్ష పూనినవారు దీక్షాంతమువఱకును క్షురకర్మము చేయించు కొనక గడ్డముపెంచుదురు. మ్రొక్కుబడులు గలవారును భార్య గర్భవతియైయున్నవారును ఇట్లే పెంచుదురు. కాని మేఁకపో

తులకట్టి గడ్డములు సహజముగనే యుండును. వాని కిట్టి దీక్షా దు లెవ్వియు లేవు. ఒకయరణ్యమునందు ఒకమేఁకలమంద గలదు. అందు కొన్ని పోతులునుగలవు. ఆమంద యరణ్యమందు ద్రిమ్మరుచు ఆకు అలములు మేయుచు ప్రొద్దుక్రుంక గనే యొకచోట విడియుచు, కాలముగడపుచుండెను.

ఒకనాఁడు అట్లవి ఆహారార్థము దిరుగుచుండ, ఒకమేఁక పోతు వెనుజిక్కి దారితప్పెను. పాపము! ఆపోతు, క్రూరమృగములకు ఠెంకియైన ఆయరణ్యమందు ప్రాణ మఱచేతబట్టుకొని ఒంటరిగ సంచరించుచుండెను. కొంతతడవునకొక సింహము దానికెదురయ్యెను. ఆసింగము మేఁకపోతును 'ఏల యిట్లు గడ్డముపెంచితి'వని ప్రశ్నించెను. ప్రాణములపై ఆశవదలుకొనిన యాయజము ఏమాత్రమును తడవుకొనక 'మిత్రమా! నేనొక అసాధ్యమగు దీక్షగై కొంటిని. దీక్షాంతమువఱకును క్షౌరముజేయింపఁదలఁచలేదు. ఆదీక్ష యెట్టిదనిన, నూఱు పెద్దపులులను, ఇరువదియైదు యేనుఁగులను, పదునైదు ఎలుఁగుబంట్లను, ఎనిమిది తోడేళ్ళను, ఒక్కసింహమును దినవలెనని. ఎట్లో కష్టపడి అరణ్యమంతయు త్రిమ్మరి, వ్యాఘ్రములను, ద్విరదములను భల్లూకములను, తోడేళ్లను తింటిని. ఇంక నొక్కసింహమును తింటినా నేఁటితో నాదీక్షపూర్తియగు' ననెను. అంత సింహము భయకంపితగాత్రమై మేఁకపోతు తన్నెక్కడ తిని పోవునో యని మాఱుమాటాడక వెనుదిరిగి కాలికి బుద్ధి చెప్పెను. ఆపోతును చావుదప్పి కన్నులొట్టవోయి స్వస్థాన

మును జేరెను. కావున, లోపల బలధైర్యములు లేకున్నను, పైకి గంభీరముగ గన్పట్టువాని ధైర్యమును మేకపోతు గాంభీర్యమని చెప్పుట లోకమునందు వాడుక.



## ౭. మర్యాదరామన్న తీర్పు.

పూర్వ మొకపట్టణమున నలుగురు దూదివర్తకులు గలరు. వీరు నలువురును కొంతమూలధనమును చేర్చికొని, గ్రామములవెంట తిరిగి దూదినికొని, ఒకకొట్టునందు నిలువ జేసి, ఎగుమతిచేయుచుందురు. ఒకప్పుడు వారిదూదికొట్టునందు ఎలుకలు జేరి, దూదిని నాశనము జేయ మొదలుపెట్టెను. ఇట్లు జరిగిన లాభము గూబలోనికి దీయునని వర్తకులు నలుగురును కలిసి ఒకపిల్లిని కొనిరి. వారందఱా మార్జాలమును అల్లారు ముద్దుగ పెంచుచుండిరి. వా రాపిల్లికి గజ్జెలు మువ్వలు మొదలగు నలంకరణములను గట్టదలంచిరి. ఎవరివంతు అలంకారములను వారుకొని నలువురును నాలుగుకాళ్ళకు గట్టిరి. అట్లు చేయుటలో ఒకరివంతుకాలికి దెబ్బతగిలి అది కుంటసాగెను. ఆకాలుగల యాతఁడు చికిత్సజేయనెంచి కాలికి నూనెగుడ్డలు చుట్టెను. అందొకగుడ్డచివర దీప మంటుకొనెను. దానితో నాపిల్లి దూదిమూటలమీఁదికి బరుగెత్త దూదియంతయు కాలిపోయెను. మిగిలిన ముప్వురువర్తకులు, ఆ నష్టమును నాల్గవవానిని భరింపుమనిరి. కాని అతఁడొప్పుకొనఁడయ్యెను.

ఆముప్పవ్వరు భాగస్వాములును గత్యంతరము లేక న్యాయా ధికారియగు మర్యాదరామన్న యొద్ద అభియోగము దెచ్చిరి. అతఁడు, ఫిర్యాది ముద్దయిలను పిలిపించి, సాక్షి వాఙ్మూలములను గైకొని తీర్పుకొఱకు వాయిదావైచెను. ఆనాఁడు న్యాయస్థాన మంతయు ప్రేక్షకులచే క్రిక్కిరిసిపోయెను. సభ్యులందఱు నష్ట మును నాల్గవవాఁడిచ్చునట్లే న్యాయాధిపతి తీర్పునిచ్చుననుకొను చుండిరి. ఫిర్యాదులు మూగురును తమకు నష్టపరిహారము వచ్చునని సంతసించుచుండిరి. అంత మర్యాదరామన్న, న్యాయ స్థానమున కేతెంచి తన పీఠమలంకరించి ఇట్లు తీర్పు చెప్పఁ దొడఁగెను:—

“పిల్లికొకకాలు కాలిపోయెను. దానికొకభాగస్థుఁడు చమురుగుడ్డలుచుట్టెను. అవి దీప మంటుకొనెను. ఆ యగ్ని తో నది దూదిపైఁ బొరల దూదినష్టమయ్యెను. పిల్లి దూదికడకు నడచుటకు సాధనమైనవి మిగిలినమూఁడుకాళ్ళుగాని కుంటికాలు కాదుగదా! ఆమూఁడుకాళ్ళును నడువనీకున్న అది దూదియొద్ద కేగుట తటస్థింపదు. ఈ మూఁడుపాదములవల్లనే పిల్లి దూది పైకి పోవుటయు, అది దగ్ధమగుటయు సంభవించెను. కాన, ఫిర్యాదులు మూవురును ముద్దయి యగు నాల్గవవానికి నష్ట మీయవలెను.”

నిరుపమానమైన ఈ మర్యాదరామన్న తీర్పు విని, సభ్యు లందఱు సంతసించిరి.

# ౮. నందో రాజా భవిష్యతి.

మనము నివసించుదేశమునకు ఆంధ్రదేశమని పేరు. ఒకప్పు డాంధ్రులు స్వదేశమునేకాక యితరదేశములను గూడ పరిపాలించిరి. అట్టివారియందు ఉత్తుంగభువుఁడను రాజొకఁ డుండెను. ఆమహీపతికి ఇరువురు భార్యలుగలరు. పట్టమహిషి యందు నందుఁడను పుత్రుఁడొకఁ డుదయించెను. పిమ్మట నాతఁడు రెండవభార్యను వివాహమాడెను. ఉత్తుంగభువుఁడు ద్వితీయకళత్రమును ఎక్కుడుగ ప్రేమించుచు, జ్యేష్ఠభార్యను అనాదరింప మొదలిడెను. తుదకాతఁడు పెద్దభార్యను నామె కుమారుని ఊరివెలుపల నొకగృహమందుంచి, చిన్నభార్యచే వారికి దినవెచ్చ మిప్పించుచుండెను. పట్టఁపుదేవి, రాజభోగము లన్నియు వర్జించి, ఒక్కపరిచారికను మాత్రము అసితోడుగ నుంచుకొని కాలక్షేపము చేయుచుండెను.

ఇట్లుండ నొక్కనాఁ డాభూపతికడకు ఒకగుడ్డలవర్తకుఁ డేతెంచెను. ఆతఁడు అమూల్యములగు వస్త్రముల నెన్నిటినో తెచ్చెను. చిన్నభార్య వానినన్నిటినిఁ జూచి, రెండువేల రూప్యములవిలువగల యొక్క చీనిచీనాంబరమును కొనఁదలఁచెను. కాని భర్త, ప్రస్తుతము తనయొద్ద ధనము లేదనియు మఱియొకసారి కొనవచ్చుననియు, భార్యకు నచ్చఁజెప్పి వర్తకుని పంపివైచెను.

బత్తెమునకై వచ్చినదాసి, యిదియంతయుఁ జూచి వర్తకుని తన యజమానురాలికడకు తీసికొనిపోయెను. ఆచీరెను

కొనుమని నిర్బంధించెను. ఆమెయు ఉదరపోషణకై యొరుల యాచింపవలసిన తానంత విలువగల వస్త్రమును ఎట్లుకొనఁగల ననెను. అనుటయు దాసి "వస్త్రమూల్య మిప్పు డీయనవసరము లేదు. ఆఱునూసములకు తరువాత ఇచ్చునట్లు వర్తకు నొప్పించెద" ననెను. రాణి అప్పుడుమాత్రము తనకంత ద్రవ్య మెట్లులభించునన దాసి యిట్లనెను:—

"శ్లో॥ ఉత్తుంగభువనాశాయ దేశకాల గతోపివా
వాణిజ్య మృతనాశాయ నందో రాజా భవిష్యతి॥

ఆఱునెలలకు పిమ్మట ఏదియెట్లు మార్పు జెందునో ఎవ్వఁడెఱుఁగును. రాజు మృతినొందనైన వచ్చును. లేదా దేశకాలములు మార్పుచెందవచ్చును. వర్తకుఁడు మరణింపవచ్చును. లేకున్న మననందుఁడే రాజుగావచ్చున" నెను.

అంతట ప్రభ్వి వాయిదాపై పైక మిచ్చునట్లొడఁబడి, ఆవస్త్రమును గైకొనెను. నాలు గైదుదినములు దానినిధరించి దాసి కిచ్చివైచెను. దాసియు దానిని గట్టుకొని, నరపాలుని రెండవభార్యకడకు బత్తెఁపునూకలకై వెళ్లెను. ఆమె "ఈచీరె నీకెట్లు లభించిన"దన, దాసి, 'రాజానుగ్రహమున్న చీరెలకేమి కొదువ?'యనెను. ఆపె, తోఁకత్రొక్కిన త్రాచునలె మండిపడి, భర్త తానిమ్మనిన ఈయక పెద్దభార్యకు కొనియిచ్చెననియు, తనకు తెలియకుండ నామెయింటికి రాకపోకలు చేయుచుండెననియు, సందేహించెను. తత్క్షణమే కుపితలగుస్త్రీలకు సహ

జమగు నురిపెట్టుకొని మరణించెను. రాజది చూచి తన్ను మిక్కిలిగ ప్రేమించు భార్య మరణించెనని మిగుల దుఃఖించి, తానును ఆత్మత్యాగముఁ జేసికొనెను. దాసి యిదియంతయు తనరాణి కెఱిఁగించెను. ఆమెయు భర్తృ మరణమునకై వగచి, దహనాదిసంస్కారము లొనరించి, పుత్రునకు పట్టాభిషేక మొనరించెను. వర్తకునకు రెట్టింపుధన మిప్పించెను. కాన, అనాగతమును దెలియుట మానవులకు శక్యముగానిపని.



# ౬. దొందూ దొందే.

ఒకానొక గ్రామమున ఒకవైశ్యుఁడుండెను. అతఁడు మిగుల దరిద్రుఁడు. వాణిజ్యముచే పొట్టపోసికొందమన్న వానిచేతియందు గుడ్డిగవ్వయైనను లేదు. కర్షకవృత్తిచే జీవింత మన్న భూవసతి గోష్పాదమంతయైనను లేదు. అతఁడెట్లో యా యవారముసల్పి, భార్యాపుత్రుల పోషించుచుండెను.

కొంత కాలమునకు అతని పుత్రునకు యుక్తవయసు వచ్చెను. తండ్రి వృద్ధుఁడయ్యెను. ఎట్లైనను తాను మరణింపక పూర్వమే కుమారుని ఒకయింటివానిఁ జేయఁదలఁచెను. కాని గర్భదరిద్రునకు కన్య నెవరిత్తురు? అతఁడు, నిరుపేదయగుటయు కాక రూపవిహీనుఁడు. మాటయైనను సరిగరాదు. నంగి మాట. ఐనను 'కాకిపిల్ల కాకికిముద్దు' అనినట్లు, ఆవణిజుఁడు తనకుమారునకు ఎట్లయిన పెండిలి సేయఁదలఁచెను. చాల

దూరము వెదకి 'గంతకుతగ్గ బొంత' యనినట్లు ఒకసంబంధము కుదిర్చెను. ఉన్నంతలో లోపములేకుండ వివాహమునకు సిద్ధమై తరలిపోయెను.

పెండ్లి పూర్తియగువఱకును మాట్లాడిన, తనపస బయల్పడు నేమోయని, వరుఁడు సంజ్ఞాపూర్వకముగనే సర్వమును వెడలఁబుచ్చెను. ఎట్లో వివాహము పూర్తియయ్యెను. వధూవరులు పల్లకిపై నెక్కి, స్వగృహమునకు వెడలుచుండిరి. పురోహితుఁడు వెంటఁబోవుచుండెను. మధ్యమార్గమున వారొక చింతతోఁపుమీఁదుగ వెళ్ళవలసివచ్చెను. చింతచెట్లు బాగుగ పూచి కన్నులపండువొనరించుచుండెను. ఇంతదనుక మూకీభావమునవహించిన పెండ్లికుమారుఁడు, తన ప్రజ్ఞావిశేషమును భార్యకెఱుకపఱుపఁదలఁచి "తింతతెత్లుపూతినవి తూతితివా?" అనెను. 'చింతచెట్లు పూచినవి చూచితివా'యని వానిభావము. పెండ్లికుమార్తెయు తాను మాట్లాడకున్న తన్ను భర్త తెలివి తక్కువదానిగ నెంచునేమోయని "పూతేకాలమువత్తే పూతక పూతక త్రోతుందా" యనెను. పూచెడికాలమువచ్చిన పూయక పూయక పోవునా యని యాపె భావము. ఇంతదనుక వరుని యందించుక లోపమున్నను వధువు తెలివిగలదని యెంచుచున్న పురోహితుఁడు "దొందూ దొందే" అనెను. 'రెండును రెండే' యని యాతని అభిప్రాయము.

# ౧౦. కలువాయి వేదాంతము.

అది వేసఁగికాలము. మట్టమధ్యాహ్నమయ్యెను. సూర్యుఁడు తన తీక్ష్ణకిరణములచే భూమినంతయు తపింపఁ జేయుచుండెను. జలాశయములన్నియు ఇంకి వట్టిపోయెను. సమస్త జీవరాసులును చండకరుని తీవ్రతకు భయపడి మోముఁ జూపుటకైన సాహసింపక, మూలమూలలదాఁగి యుండెను.

ఇట్టి సమయమున నిర్మానుష్యమగు నొకమార్గమున ఒకబ్రాహ్మణుఁ డేగుచుండెను. ఆతఁడు, మాటిమాటికిని స్వేద జలము నుత్తరీయముచే తుడిచికొనుచు, ఎండవేడిమిని భరింపఁ జాలక రొప్పుచు రోజుచు నడచుచుండెను. ఆతఁడెంత యవసరమగుపనిపై ఏగుచుండెనో, ఆతని గమ్యస్థానమెద్దియో యెవ్వరికిని ఎఱుకలేదు. కొంతదవ్వేగునప్పటికి బ్రాహ్మణునకు దాహమతిశయమయ్యెను. నాలుక పిడుచకట్టుకొని పోవుచుండెను. ఆతఁడు నలుగడల దృష్టిసారించి వెదకినను నీటిజాడ ఎచ్చటను కన్పట్టదయ్యెను. అట్లే ప్రాణముబిగబట్టుకొని కొంతదూరమేగ, కూఁతవేటుదూరమున నొకగ్రామము పొడకట్టెను. మనబాటసారి యటకేగి, పిపాస నివారింపఁదలఁచి, వేగముగ నడచివెళ్లెను.

ఇదియే కలువాయియను గ్రామము. ఇందలి జనులందఱు మిగుల వేదాంతులు. వారు ప్రతివిషయమందును అవసరమున్నను లేకున్నను మెట్టవేదాంతమును ఏకరువుపెట్టుచుందురు. ఈవిప్రుఁ డాయూరి వెలుపలకుఁబోవ, ఒకనూయి గన్పట్టెను. అప్పుడే యొక పూర్వసువాసిని అచట నీరుతోడుకొను

చుండెను. పాప మాభూసురుఁడు గంపెడాసతో "అమ్మా! చాలదూరమునుండి వచ్చుచుంటిని. దాహము మిక్కుటముగ నున్నది. నాలుక బొడ్డువఱకు లాగుచున్నది. చెంబు నొకసారి యిచ్చెదరా? నీరుత్రాగి మరలనిచ్చెద" ననెను. వెంటనే ఆ వితంతువు "అయ్యా! ఈశరీరము అశాశ్వతము. నీటిబుగ్గవలె క్షణికము. ఆత్మయొక్కటియే శాశ్వతమైనది. నశింపనిది. దాహ మననేమి? త్రాగుటయననేమి? చెంబేడ? ఇచ్చుటేడ? ఇచ్చునదె వరు ? ఇప్పించునదెవరు ? తీసికొనున దెవరు ? " అను ప్రశ్న పరంపర గురిపించి, చెంబీయకయే వెడలిపోయెను. హతాశుఁ డగు నాభూదేవుఁడు నిశ్చేష్టుఁడయ్యెను. ఇంతలో ఒకసుమంగలి యట కేతెంచెను. ఆమెయు వేదాంతము నుపన్యసించెనేకాని, బ్రాహ్మణునకు చేదగాని, త్రాడుగాని ఈయదయ్యెను. ఎంత మంది నడిగినను అట్లే చెప్పుచుండిరి.

తుదకు బ్రాహ్మణుఁడు విసిగి, ఒకరియొద్దనుండి త్రాటిని బిందెను బలాత్కారముగ లాగికొని, నీరుతోడికొని త్రాగి, ఆబిందె తీసికొని వెడలిపోవుచుండెను. అంత నటనున్నవా రఁదఱు "దొంగ దొంగ"యని కేకలిడ, ఊరివారందఱు గుమి కూడి యాబ్రాహ్మణు 'నేల యిట్టి చౌర్యమొనరించితి?' వని ప్రశ్నించిరి. అతఁడును, 'అయ్యలారా! నేనెవరు? మీరెవరు! బిందెయెట్టిది? తీసికొనిపోవుటయననేమి? తీసికొనిపోవువా రొక రుందురా? నాయందును మీయందును ఉండున దొక్కయాత్మ

యేకదా ? మీబిందెమైన నాదికాదా ? నాబిందెయనిన మీది కాదా' యని అడుగుచు బిందె నీయకయే వెడలిపోయెను.

## ౧౧. ఇసుకతక్కెడ పేడతక్కెడ.

పూర్వ మిరువురు మోసగాండ్రు కలరు. ఒరులను మోసముచేయుటయందు వీ రిరువురును అందెవేసినచేతులే. ఎంతటి తెలివిగలవారినైనను వీరు నిముసమాత్రమున మోసగింపఁగలిగి యుండిరి. వీ రిరువురును ఒక్క గ్రామస్థులుగారు. ఒకరిముఖ మొక రెఱుఁగరు. కాని యీతని మోసమును గుఱించి, ఆతఁడును, ఆతని వంచకత్వమును గుఱించి ఈతఁడును వినియుండిరి. అదియాదిగ ఒకరి నొకరు వంచింప వేచియుండిరి. ఈతని వంచించినగాని తాను గొప్పమాయావిని గానని యీతఁడును, ఆతని మోసగించినగాని తాను గొప్ప మోసగాఁడను గానని యీతఁడును తలఁచుచుండిరి. ఎట్లైనను ఒకరినొకరు కనుబ్రామ ప్రతినఁజేసిరి.

అందొకఁడు కొంత యిసుకను మూటగట్టికొని, రెండవవాని యూరికి పయనమయ్యెను. ద్వితీయుఁడును కొంత పేఁడను మూటగట్టికొని, మొదటివాఁ డుండు గ్రామమునకు బయలుదేరెను. కొంతసేపటికి ఇరువురును మధ్యేమార్గమున కలిసికొనిరి. ఇంతదనుక నొకరిదర్శన మొకరి కబ్బలేదు. కావున

నొండొరులఁ గనుఁగొనలేరైరి. ఒండొరుల క్షేమవార్తలు కనుఁగొనినపిమ్మట నొకఁడు "అన్నా ! క్షుద్బాధ మిక్కుటముగ నున్నది. నాదగ్గఱ చల్దియన్నమున్నదిగాని, నాభార్య వలదనిన కొలఁది అందు పచ్చడివైచి కట్టినది. పెఱుగన్నమనిన నాకు చాల ప్రీతి" యనెను. తత్క్షణమే రెండవవాఁడు " సోదరా! కాకతాళీయమన నిట్టిదియే కదా ! భగవదనుగ్రహముండిన తలవని తలంపుగ మనకు కావలసినది లభించును. మాయింట పాడిమెండుగఁ గలదు. కొలఁది దినములనుండియు పెఱుగు త్రావి త్రావి విసుగెత్తినది. నేఁడును నాభార్య పెఱుగన్నమే మూటగట్టినది. తిందమన్నను పచ్చడిమెతుకులు లభింపకున్నవి. నీమూటనిట్లిమ్మ"నెను.

అంత మోసగాండ్రిరువురును తమ మూటలను మార్చికొనిరి. 'ఈతఁడెవ్వఁడో నేఁడు నాబారిఁబడి మోసగింపఁబడెనని ప్రథముఁడ'నుకొనెను. 'పాపమీ యమాయికుని త్రుటిమాత్రమున వలనుద్రోచితి'నని ద్వితీయుఁ డనుకొనెను. ఇట్లు తమ తమ ప్రజ్ఞావిశేషమున కానందించుకొనుచు ఎవరిదారిని వారు వెడలిరి. కొంతదవ్వేగిన పిమ్మట నొకఁడు తన మూటవిప్పికొనిచూడ నం దిసుకతప్ప వేఱొండేమియు లేదయ్యెను. రెండవవాఁడును నట్లేచేయ, అందు పేఁడమాత్రముండెను. ఇట్లిరువురును, వంచింపఁబడితిమనియు, తానువిన్న వంచకుఁ డీతఁడేయైయుండుననియు, అనుకొని స్వస్థలములు చేరిరి. నాఁటనుండియు జనులొకరిని ఇసుకతక్కిడ యనియు, రెండవవానిని పేఁడ తక్కిడయనియు, పిలువసాగిరి.

# ౧౨. సింగఁడద్దంకి పోయివచ్చుట.

మేదరమెట్టయను గ్రామమున సింగఁడను యువకుఁడొకఁడు గలఁడు. అతనికి బాల్యముననే తలిదండ్రులు మరణించిరి. ఉదరపోషణమునకు అతనికి వేఱుమార్గములేక, ఒక బ్రాహ్మణునింట నౌకరిగ గుదిరెను. ఆతఁడమాయికుఁడు. లౌకికజ్ఞాన మిసుమంతయు లేదు. ఆతఁడు తన యమాయికత్వము వలన యజమానున కెన్నియో సారులు నష్టముకలుగఁజేసెను. కాని బాల్యమునుండియు, తన్నాశ్రయించి యుండుటవల్లను తలిదండ్రులులేని నిరాధారుఁడగుటవల్లను, బ్రాహ్మణుఁ డాతని వదలఁజాలకుండెను. యజమానుఁడేకాక ఆతనియింటఁగల వారాబాలగోపాలమును సింగని సాదరంబుగఁ జూచుచుండిరి.

ఆతని లోకజ్ఞానశూన్యత కొకయుదాహరణ మిచ్చెద:— ఒకనాఁడా విప్రుఁడు సకుటుంబముగ నొకశకట మారోహించి, గ్రామాంతరమునకు వెడలుచుండెను. సింగఁడు బండివెంట నేగుచుండెను. వారు కొంతదూర మేగునప్పటికి చీఁకటిపడెను. యజమానుఁడు "సింగా! కన్నుబొడిచికొన్నను కానరాకున్నది. బండినుండియేమైన జారిపడునేమో జాగ్రత్తగఁ జూచుచుండుము. వస్తువెద్దియైన క్రిందపడినవెంటనే బండియందు పడవేయుము" అనెను. సింగఁడు చిత్తమట్లే చేసెదనని వచ్చుచుండెను. బండిలోనివారు ప్రయాణఁపు బడలికచే కన్నుఁగూరుకుచుండిరి. కొంతసేపటికి బండికిఁ బూన్చిన వృషభములు పేఁడ్వైచెను.

తత్క్షణమే సింగఁడద్దాని ప్రోగుచేసి బండియందు పడవైచెను. శరీరమున కెద్దియో చల్లఁగఁదగుల, బండిలోనివారు మేల్కాంచి చూచుకొనిరి. తెల్లనివస్త్రములన్నియు పేఁడమరకలచే మలినములయ్యెను. యజమానుఁడు "సింగా! ఏలఇట్లొనర్చితి?" వన నాతఁడు "స్వామీ! ఇంతకుముందేకదా! ఎట్టివస్తువైనను క్రిందఁబడిన బండియందు వడవేయుమంటి?" రని ప్రత్యుత్తరమిచ్చెను. ఇట్టి పొరపాట్లు ఆతనికి సహజమేకాన, వారంద ఊరకొనిరి. సింగఁడట్టి మూఢాగ్రేసర చక్రవర్తి.

మనబ్రాహ్మణునకు అద్దంకియను గ్రామమున బంధువులు గలరు. ఒకనాఁడాతనికి వారితో అత్యవసరమగు పని యెద్దియో కలిగెను. ఆరాత్రి భుజించిన పిమ్మట నా భూసురుఁడు భార్యతో 'నేఁడు మనవారితో అవసరమగు కార్యమొకటి కలిగినది. ఎవరినైన నటకుఁబంపవలె' ననెను. భార్య 'ఎవరినో యననేల? మనసింగని అద్దంకికిఁ బంపుదము. ఆతఁడైన జాగుసేయక తత్క్షణమే తిరిగిరాగలఁడ'నెను. బాహ్మణుఁడును 'అట్లే చేయుద'మనెను. ప్రక్కను పరుండి యీ సంభాషణ మంతయు వినుచుండిన సింగఁడు వెంటనే ఎవ్వరికిని చెప్పక బయలుదేరెను. అద్దంకిగ్రామము ప్రవేశించి తత్క్షణమే వెనుఁదిరిగెను. తెల్లవారకమున్న స్వగ్రామముచేరి మరల తనప్రక్కపై పరుండెను. బ్రాహ్మణుఁడు సింగని అద్దంకి పంపనెంచి 'సింగా! తెల్లవారుచున్నది. అద్దంకిపోయి రావలెను లెమ్మ'నెను. వెంటనే యాతఁడు 'సింగఁడద్దంకి పోనూపోయెను. రానూ వచ్చె'నని జవాబుచెప్పెను. అద్దంకిపోయియు పనినేర

వేర్పఱుండ వచ్చిన యాతని వివేకహీనతకు బ్రాహ్మణ దంపతు లిరువురు నవ్వుకొనిరి.

## ౧౩. ఎంత పెందలకడ లేచినను చింతగుంటకడనే తెల్లవారుట.

గుంటూరు మండలమున క్రొత్తపట్టణమను సుప్రసిద్ధ నగరము కలదు. ప్రస్తుత మది సామాన్యమగు గ్రామమువలె నున్నను, ఒకప్పుడది గొప్ప రేవుపట్టణమును, వర్తకస్థానమునై యుండెడిది. ఈమండలమున పూర్వపుఔన్నత్యమునుబోఁగొట్టు కొని, యిప్పుడు సాధారణఁపు గ్రామములవలె కన్పట్టు నగర ములు పెక్కులు గలవు. నిజామపట్టణము, ఓడరేవు మొద లగునవి యిట్టివి. క్రొత్తపట్టణము బంగాళాఘాతమను సముద్రతీరమునఁ గలదు.

పూర్వ మీపట్టణమునకు పరిసర గ్రామములనుండి జనులు, బండ్లతోడను, కావళ్ళతోడను,గంపలతోడను,సరకులు దీసికొని వచ్చుచుండిరి. సర్కారువారు వ్యాపారార్థ మేతెం చిన ఇట్టి బండ్లు, కావళ్లు, గంపలు మొదలగువానిపై, కొంత సుంకము వసూలుచేయుచుండిరి. ఇప్పటికిని ప్రతిపెద్దపట్టణము నొద్దను ఇట్టి సుంకమును వసూలుచేయుశాలలు గలవు. వీనిని సుంకఁపు శాలలందురు.

ఈ క్రొత్త పట్టణమునకు సమీపమున పూర్వము చింతగుంటయను ప్రదేశ ముండెడిదట. ఈ చింతగుంట కడనే సర్కారువారి సుంకఁపుశాలయు నుండెడిదట. ఒకదినమున నొక సమీపగ్రామమునుండి యొక కాఁపు, బండిపై సరకులువైచుకొని, క్రొత్త పట్టణమునకు వచ్చెను. పగలంతయు కష్టపడి సరకు లమ్ముకొనెను. ప్రొద్దు క్రుంకఁగనే యాకాఁపు, బండ్లు విడియు స్థలమున తనబండిని దించి, ఇంటికడనుండి తెచ్చిన యాహారమునుతిని బండికి చేరువగఁ బరుండెను. అట్టిసమయమున నాతని కొక విపరీతఁపు టూహాజనించి యిట్లనుకొనెను. "తెల్లవారినపిదప సుంకఁపుశాలకడ బండికనపడినగదా సుంక మీయవలెను! రెండుజాముల ప్రొద్దుండగనే లేచి, బండిని మారుత్రోవను తోలుకొనిపోయిన ఎవ్వఁడుకనుఁగొనఁగలఁడు.

అట్లు చింతించి అర్ధరాత్రముననే శకటమునకు ఎద్దులఁ బూన్చుకొని పయనమయ్యెను. నాఁడు అమవస యగుటచే, అంధకారము గాఢముగ నలముకొనెను. ఆచిమ్మచీఁకటియందు ఎద్దులకుఁగాని, మనుష్యునకుఁగాని, కన్నుపొడిచినను గానరాక మార్గము దెలిసికొనుట కయితిగాకుండెను. అందును ఎద్దులకది అలవాటుపడిన మార్గముగాక, క్రొత్తమార్గమై యుండెను. కావున మనకాఁపు అంత ప్రొద్దుకడ లేచినను, తెల్లవారు నటికను క్రొత్తపట్టణము చుట్టునే తిరుగుచుండెను. అట్లు తిరిగి తిరిగి, ఆబండి చింతగుంట కడకు వచ్చునప్పటికి సూర్యోదయమయ్యెను. సుంకఁపుశాలాధికారులు బండినాపి, యథావిధిగ సుంకమును వసూలుచేసిరి. పాపమాకాఁపు ఎంతపెందలకడ

లేచినను, చింతగుంటకడనే తెల్లవారి సుంకమీయక తప్పద య్యెను. కాన, ఆతని శ్రమయంతయు వృథాయయ్యెను.



## ౧౪. గాలివానవచ్చిన కథయేమాయెను.

నాగరికత పెచ్చుపెఱిగిన నీకాలమున, ప్రజలు నాటకములు, సినిమాలు మొదలగునవి చూచుచుందురు. కాని, పూర్వకాలమున జంగముకథలు, హరికథలు, తోలుబొమ్మలాటలు, మున్నగునవి చూచి తృప్తిచెందెడివారు. ప్రతి గ్రామమునందును ప్రజలిట్టి కథలువినుచు, ధాన్యరూపముననో ధనరూపముననో కథకుల బహూకరించుచుండెడివారు.

ఒకగ్రామమున తుంటరియగు వడ్రంగి యొకఁడుండెడివాఁడు. అతడు ఏకథజరుగుచున్నను కుంటిప్రశ్నలు వైచుచు, కథాప్రవాహమునకు అడ్డుదగిలి, కథను సాగిపోనీక, కథకులను శ్రోతలను విసికించుచుండెడివాఁడు.

ఒకనాఁడు గ్రామస్థులందఱును గలిసి, యీతని రానీకుండఁ గనే కథను సాగింపవలెనని ప్రయత్నించిరి. కథజరుగునను విషయమాతనికి ఎఱుకపఱుపక, ప్రొద్దుక్రుంకఁగనే ఊరి వెలుపలనున్న యొకతోఁటలోనికేగి, కథను చెప్పించుచుండిరి. మన వడ్రంగి, ఈవిషయ మెట్లో ముందుగనే పసికట్టి, ఆ యుద్యానవనమునకేగి, అచ్చట నొక చెట్టుపై దాఁగియుండెను.

కథను హృదయంగమముగఁ జేయుటకై ప్రతికథకుఁడును కథామధ్యమున, పిట్టకథలు చెప్పుచుండుట వాడుక. అట్లే అచట కథనడపువాఁడొక పిట్టకథను ప్రారంభించి, ఇట్లు చెప్పఁ దొడఁగెను.

"ఒకప్పుడొక పుల్లియాకునకును, ఒక మట్టిగడ్డకును స్నేహము కుదిరెను. అవి తమలోతాము ఒక ఒడంబడిక చేసికొనెను. గాలివచ్చినపుడు పుల్లియాకెగిరిపోవుట సహజము కాన, అట్టి సమయమున మట్టిగడ్డ దానిపై నుండవలెను. వానగురిసినపుడు మట్టిగడ్డ కరగిపోవునుగాన, అట్టి యదను పుల్లియాకు మట్టిగడ్డపై కప్పుకొనవలెను. ఇట్టివి రెండును ఆపత్కాలమున ఒండొంటిఁ గాపాడుకొని, ప్రత్యుపకారము చేసికొనుట కంగీకరించెను."

అని ఇంక నేమేమియో చెప్పఁబోవుచుండఁ, వృక్షాగ్రమున నాసీనుఁడై యున్న యావడ్రంగి, ఇదియ యదననుకొని, "గాలి, వాన, వచ్చిన ఎట్లు?" అని బిగ్గరగ ప్రశ్నించెను. ఊరివారందఱు అదివిని, ఈపీడ నిటకుఁగూడ వచ్చెనేయని చింతించిరి. కథకుడుఁను వడ్రంగి ప్రశ్నకు సరియగు ప్రత్యుత్తర మీఁజాలక, గాలివానవచ్చిన కథయేమాయునని, కథనాపి వెడలిపోయెను. ప్రేక్షకులందఱు కథను సాగనీని వడ్రంగిని లోలోపల తిట్టుకొనుచు, నిండ్లకేగిరి.



# ౧౫. రెంటికిఁజెడిన రేవఁడు.

కృష్ణాతీరమున విజయవాడయను పట్టణము అలరారుచుండును. దీనికిప్పుడు బెజవాడయను నామాంతరము గలదు. ఆంధ్రదేశమునందలి సుప్రసిద్ధ నగరములందు ఇదియొకటి. ఇయ్యది గొప్ప వర్తకస్థానము. పెక్కు అయోమార్గములకు కేంద్రము.

కొలఁది కాలము క్రిందట ఈ పట్టణమున నొకచాకలి యుండెను. అతఁడు మిగుల జాగరూకత కలవాఁడు. వస్త్రములను శుభ్రపఱచుటయందును, వానిని మరల బీఱువోకుండ యజమానులకు చేర్చుట యందును, మిగుల నెన్నికగన్న వాఁడు. ఆ రజకుఁడు అనుదినమును జాగరూకతతో తన యుద్యోగమును నిర్వహించుచు, తనకువచ్చెడి స్వల్పవేతనముతో, కుటుంబపోషణ మొనర్చుకొనుచుండెను.

ఒక్కనాఁడతఁడు ఊరివెంటఁ దిరిగి, తాను పరిశుభ్రపఱుపవలసిన వస్త్రములన్నియు ప్రోగుచేసికొనెను. వాని నొక పెద్దమూటగఁ గట్టి కృష్ణానదియందలి తన రేవునకు తీసికొని వెళ్లెను. అది వర్షరుతువు. పడమటి కనుమలయందు రెండు మూఁడు దినములనుండియు కుంభద్రోణముగ వర్షించుచుండెను. వర్షకాలమున ఏటిరాక ముందుగ నెవ్వరు నూహింపలేరు. ఏటదిగిన మనుష్యుఁడు కొంతదూరమేగి, ఇంక నద్దరి చేరకమున్న ఏటిరాకయు ప్రాణముల పోకయు జరుగుచుండును.

కాన, నీరజకుఁడు సగమువస్త్రము లుతుకు నప్పటికి, ప్రవాహము మిక్కుటముగ వచ్చెను. కాని తదేకచిత్తుఁడై వస్త్రముల శుభ్రపఱచుచున్న యా మడియేలు ఇద్దాని గమనింపఁడయ్యెను. ఆతఁడు శుభ్రపఱచి బండపక్క నుంచిన వస్త్రములన్నియు, వెల్లువవెంటఁ గొట్టుకొనిపోవుచుండెను. వస్త్రములుపోయిన యజమానులచే మాటవచ్చునని, ఉతుక వలసిన వస్త్రము లటనేయుంచి, కొట్టుకొని పోవుచున్నవానిని తెచ్చుటకై, తత్క్షణమే వెడలెను. కాని ఈతఁడు పోవునప్పటికి ఆవస్త్రము లన్నియు, ప్రవాహవేగమున కొట్టుకొనిపోయి అదృశ్యములయ్యెను. 'నూకలకేడ్చెపడ్చి తవుడునకేడ్చి' నట్లు, ఆ రేవఁడు హతాశుఁడై, మిగిలిన వస్త్రములకై తిరిగివచ్చెను. ఈలోపల నవ్వియు, ప్రవాహమువెంటసాగి సర్వమును కృష్ణార్పణమయ్యెను.

ఎన్నఁడును యజమానులచే మాటపడియెఱుఁగని యా చాకలి, మిగుల విచారించుచు ఇంటి కేగెను. కాన, ఎద్దియే నొకకార్యమును సాధింపఁబూనిన మానవుఁడు, కార్యాంతరమున కేగి నదియు నిదియుఁ జెడఁగొట్టుకొనిన నాతని రెంటికిఁ జెడిన రేవఁడని పిల్తురు వాడుక.



# ౧౬. రేఁజీఁకటి యల్లుఁడు.

పండుగ దినములందు క్రొత్తయల్లు రత్తవారింటి కేగుట సహజము. ఒకపండుగనాఁ డొకయల్లుఁడు తన అత్త వారింటికిఁ బోవ పయనమయ్యెను. పాప మాతనికి రేఁజీఁకటి కలదు. కనుక ప్రొద్దుక్రుంకక మున్నే తన గమ్యస్థానమును చేరవలెనని వడి వడిగ నడువసాగెను. కాని అతఁ డత్తవారి యూరికిఁ జేరకుండగనే సూర్యాస్తమయ మయ్యెను. కనుచీఁకటి పడెను. ఎట్లో తడవుకొనుచు నతఁ డత్తవారింటికడ కేగి, వాకిట నున్న పాతర గోతియందు పడెను.

ఇంటిలోనుండి యాశబ్దమును విన్న యతని బావమఱది, దీపమును దెచ్చి చూచి, పాతరయందున్నది తన బావయే అని గ్రహించెను. 'బావా! ఇదియేమి! పాతరయందు పడితివి. గ్రుడ్డివాఁడవా'? అని పరిహాసమాడెను. అతఁడు 'పడుటగా దోయి వెఱ్ఱిమొగమా! మా ప్రాంతములందు పాతరలు నిచ్చెన లున్నగాని ఎక్కుటకును దిగుటకు నయితిగాదు. ఈ పాతర యింత మెరకగనుండుట కాశ్చర్యపడి, తమాషాకు దుమికితిని. నీచేయి నిటు దెమ్మ'నెను. శ్యాలకుఁడు చేయూఁత నొసఁగ అతఁ డెట్లో పాతరనుండి బయటపడి లోనికేగెను.

అల్లున కర్ఘ్యమర్యాదలు జరిగిన పిమ్మట, భోజనమునకు లెమ్మనిరి. మామయు నల్లుడును బావమఱఁదియు ఏకపంక్తి నాసీనులై భుజించుచుండిరి. అత్త వడ్డనసేయుచుండెను. ఆమె,

భర్తకును కుమారునకును మజ్జిగవడ్డించి, అల్లునకు పెరుఁగు వడ్డించుచుండెను. గడ్డకట్టినపెరుఁగు వడ్డించునపుడు కుత కుత మను శబ్దమువచ్చుట సహజము. ఆశబ్దము విని పాప మాయల్లుఁడు తన విస్తరియందలి పెరుఁగును పిల్లి త్రాగిపోవుచున్నదనుకొని, శక్తికొలఁది లాగి అత్తగారి దవుడపైఁ గొట్టెను. బావమఱఁది "ఇదియేమి బావా?" యన, నతఁడు "నేనంత యల్లుఁడనైనను ఏకపంక్తిని గూర్చున్నపుడు పెద్దవారగు మీ యిరువురకు మజ్జిగయు, నాకు పెరుఁగును, వడ్డించుటవలన కోపము నాపలేక, అట్లొనర్చితి" ననెను. ఎట్లో భోజనము పూర్తిచేసి, యింటఁగల వారందఱును పరుండిరి.

అర్ధరాత్రిమున అల్లుఁడు ఇంటివెలుపలకుఁ బోవలసి వచ్చెను. ఆతఁడట్లే తడవుకొనుచు బయటికేగి, లఘుశంక దీర్చికొని వచ్చి, తన ప్రక్కను కనుగొనలేక, అత్తగారిప్రక్కపై కూర్చుండెను. ఆమె 'ఇదియేమి?' యన "అత్తగారూ! మీరు తల్లితో సమానులు. త్వరపడి మిమ్ము భోజనముకడ కొట్టితిని. ఆ తప్పుక్షమింప వేఁడుటకై ఇప్పుడిటకు వచ్చితిని. నాచేయిపట్టుకొని, నామంచముకడకు దీసికొనిపోయిన, నాతప్పు సైరించినట్లెంచెద" నని కాళ్ళుగట్టిగ పట్టుకొనెను. ఆమెయు అల్లుఁడు తనచేసినతప్పుకై పశ్చాత్తప్త హృదయుఁడయ్యెనని యెంచి, అట్లే క్షమించితినని చేయిపట్టుకొని, యాతని మంచము చేర్చెను.



# ౧౭. చదువురాని యల్లుఁడు.

ఒకప్పు డొక నిరక్షరకుక్షియగు అల్లుఁ డత్తవారింటి కేగెను. వారతనికి పెక్కు మర్యాదలొనర్చి, అనుదినమును షడ్రసోపేతమగు భోజన మిడుచుండిరి. ఒక్కనాఁ డెటనుండియో వారికొక ఉత్తరమువచ్చెను. మామ కార్యాంతరమున నెచటికో వెడలెను. ఉత్తరము రాఁగనే అత్త అల్లునకిచ్చి చదువు మనెను.

అతఁ డెగాదిగ చూచి, మాఱుమాటాడక, తెల్లమొగము వైచెను. ఎద్దియో అశుభవార్త వచ్చెనని అత్త, 'ఏమి నాయనా! అట్లూరకుంటివి. అందఱును క్షేమముగనుండిరిగదా' యనెను. అల్లుఁడు ప్రత్యుత్తరమీయక కనులవెంట నీరుకార వెక్కి వెక్కి ఏడువసాగెను. తమ బందుగులలో ఎవ్వరో మృతినొందిరి కాబోలునని, ఆమెయు పెద్దపెట్టున ఏడువసాగెను. ఈ రోదనధ్వనివిని, యింటఁగలవారందఱు కారణము గ్రహింపకయే, ఒక్కసారిగ విలపింప మొదలిడిరి. ఈ యింటివారి కెద్దియో విపత్తు సంభవించెనని, యిరుగు పొరుగు వారును ఓదార్పవచ్చి, కనులవెంట నీరు గార్ప ప్రారంభించిరి.

కొంత తడవునకు శ్వశురుఁ డింటికేతెంచి, యీ గందరగోళమును జూచి, గుండె బాదుకొనుచు విషయ మేమియని ప్రశ్నించెను. కాని, ఒక్కరును ప్రత్యుత్తర మీయరైరి. ఎట్టకేలకు అత్తశోకము నాపుకొని " మా పుట్టినింట కడనుండి

నేఁ డొక ఉత్తరము వచ్చినది. అది చదువుమని అల్లు నకిచ్చితిని. ఆతఁడు జాబు తీసికొనుటయే తడవుగ ఏడువ ప్రారంభించెను. అచట నెవ్వరో మరణించియుందు" రని మరల కడుపుబ్బ నేడువ మొదలిడెను. మామ, "ఇదియేమిచిత్రము! ఇప్పుడేకదా! వారియూరిమనుష్యుఁడొకఁడు కన్పడి, అందఱును కుశలముగ నున్నారని చెప్పెను. ఇంతలో ఇట్టి యుపద్రవమేమి కలిగె? ఆయు తర మిటు తెమ్ము." అనెను. ఆపెయు అలునొద్ద నుండి ఉత్తరము దీసికొని భర్తకిచ్చెను.

ఆతఁడు దాని నామూలాగ్రముగ చదివి, "అట్టి య శుభవార్త యెచ్చటను లేదే! మీఁదుమిక్కిలి మీయన్నకు పుత్రోదయ మయ్యెననియు, బారసాలకు మనల నందఱ రమ్మ నియు, కలదు. ఈ యేడ్పులేమి? ఈ పెడబొబ్బలేమి?" అనెను. అందఱును నివ్వెరపడిరి.

కాని అల్లుఁడింకను శోకము మానఁడయ్యె. మామ జా మాత కడకేగి "యిట్టి శుభవార్తకేల విలపించుచుంటివి?" వన "నేను బాల్యమున విద్యాభ్యాసము చేయునపుడు మాగురువు "మా" యను అక్షరమును దిద్దఁబెట్టెను. అప్పుడది చాలపెద్ద దిగ నుండెడిది. పాప మీ యుత్తరమునఁ జూడ, అదిచాల చిన్నదయ్యెను. ఈ కొలఁది కాలముననే ఇంత కృశించెనే! ఇఁకముం దింకను గృశించి, కాలక్రమమున కంటికగుపడకుండ నశించునేమోయని, విలపించుచుంటి" నని అల్లుఁడు ప్రత్యు త్తర మిచ్చెను. ఆతని తెలివితేటలకు అత్తమామలేకాక ఊరి వారందఱును సంతసించిరి.

# ౧౮. దొంగా! చెయికఱచెదవు సుమా!

అది అమవసనిశి. గాఢాంధకారము దిక్కులనలము కొని కన్నుపొడిచినను కానరాకుండెను. ఆకసము మేఘావృత మైనందున చీఁకటి యినుమడించినట్లుండి, ఒకరి కొకరు కన్పడు టయే అశక్యముగ నుండెను. ఇట్టి రాత్రిలు చోరులకు మిక్కిలి అనుకూలములు.

నాఁటి అర్ధరాత్రిమున ఒకతస్కరుఁడొక కోమటియింట కన్నమువైచి, లోనికి ప్రవేశించెను. ఆయింట వైశ్యుఁడును, ఆతని భార్యయు తప్ప నొండెవ్వరును లేరు. ఆదంపతు లిరు వురు మైమఱచి నిదురించుచుండిరి. ఇదియ యదననుకొని యా చోరుఁడు, ఇంటఁగల వస్తువులన్నియు నూఁచముట్టుగ దోఁచికొనియెను. తుదకు వర్తకునిభార్య కంఠమునందుఁగల వస్తువు నొక్కదాని నపహరింపనెంచి, మెడక్రింద చెయివెట్టెను. ఆపె అకస్మాత్తుగ మేల్కాంచి, యా తస్కరుని హస్తమును గట్టిగ నొక్కి పట్టుకొనెను. ఆపె 'దొంగ దొంగ' యని కేకలు వైచెను.

కాని, అపరకుంభకర్ణుఁడగు నా వణిజునకు ఇది కొంచె మును తెలియదయ్యెను. ఆదొంగ ముందునకును నాపె వెనుక కును లాగ ప్రారంభించిరి. ఆమె తన భల్లూకఁపుపట్టును వదల దయ్యెను. అయినను నామె అబలగాన బలాఢ్యుఁడగు చోరుఁడు ఆపె నింటిబైటికి లాగుకొని పోయెను. తుదకు భార్యపెట్టు కేకలకు ఆకోమటి మేల్కాంచి, సర్వమును గ్రహించి "వచ్చు

చుంటి పోనియ్యకు" మని గట్టిగ నఱచెను. కాని సహజభీరు వగు నావైశ్యున కొక్కయడుగైనను ముందునకు సాగదయ్యెను.

ధనాశగల యాతనిసతి, ప్రాణమునైన లెక్కఁగొనక, అట్లే యా ద్వంద్వయుద్ధమును సాగించుచుండెను. "చోరుని పట్టుకొంటిని వేగముగ రమ్ము"ని భర్తను పిలచెను. కాని, ఆతఁడు స్వస్థానమునుండి కదలక "నేను వచ్చుచుంటిని. దొంగా! నాభార్యచెయి కఱచెదవు సుమా!"అని యఱచెను. ఇంతదనుక నాపట్టును వదలించుకొనుటకు, ఉపాయముగానని యాదొంగ, ఈ మాటవిని తత్క్షణమే యామెహస్తమును గట్టిగ కఱచెను. పాపమా స్త్రీ, యాబాధను సహింపఁజాలక, తనపట్టును వదలెను. చోరుఁడు తప్పించుకొని, బ్రతుకు జీవుఁడా! యని, అటనుండి పరెము వాఱెను.



## ౧౯. చిక్కెరా! మిడుతంభొట్లు.

తొల్లి యొకగ్రామమున మిడుతంభొట్లను బ్రాహ్మణ యువకుఁడుగలఁడు. ఆతఁడు డాంబికుఁడు. ఒకనాఁడతఁడు తన అత్తవారింటికి వెళ్ళెను. అట తన ప్రజ్ఞావిశేషమును అత్తకుఁజూపనెంచెను. ఆమె ఒకనాఁడల్లునకు పిండివంటఁ జేయఁదలఁచెను. గారెలువండనెంచి ప్రొయ్యికడకూర్చుండెను.

అల్లుఁడు వీధిలోనికి వెళ్లినట్లుగ వెళ్లి, దొడ్డిత్రోవను లోనికేగి, యెరికినిఁగన్పడకుండ మచ్చుపై కూర్చుండెను. అటనొక సన్నని త్రాడుఁగన్పడ, దానిని చేతికిఁదీసికొనెను. గారెలు కాఁగుచున్న నేతిలోవైచినపుడు 'చుంయ్' అను శబ్దముకల్గుటసహాజము. ఆతఁడట్టిశబ్దము వినవచ్చినపుడెల్ల తనయొద్దనున్న త్రాటికొక ముడివైచుచుండెను. ఇట్లు పిండివంట పూర్తియగుదనుకఁ జేసి, యాముళ్లన్నియు లెక్కిడెను. మచ్చుపైనుండిదిగి, మరల పెరటిత్రోవను వీధిలోనికివచ్చి, వీధిగుమ్మమున నింటిలోనికేగెను.

అత్తయొద్దకేగి, "అత్తా! నేను వీధిలోనుండి వచ్చుచుంటినిగదా! నీవువండిన గారెలెన్నియో చెప్పుదునా?" యనెను. ఆమె అట్లేచెప్పుమన, నాతఁడేమియు హెచ్చుతగ్గులులేక సరిగ చెప్పఁగలిగెను. అత్త, యాతని అద్భుతమగు మేధాశక్తికాశ్చర్యపడి, అల్లుని గొప్పతనమునుగూర్చి, యిరుగు పొరుగు వారితోఁ జెప్పుకొనసాగెను. కాలక్రమమున నీతఁడు గొప్ప జ్యోతిష్కుఁడని, యూరివారందఱునుజెప్పుకొన ప్రారంభించిరి.

ఇట్లుండ నొక్కనాఁ డాయూర నొకరజకునిగాడిద తప్పించుకొనిపోయెను. పాపమాతఁడు తనకు ముఖ్యజీవనాధారమగు ఖరముపోకకు మిగుల విచారించి, గోలు గోలున నేడ్చుచు, నీజ్యోస్యునికడకువచ్చి చెప్పుకొనెను. ఆతఁడాకసమునంకఁజూచి, వేళ్లుమడిచి, మీనమేషములులెక్కిడి, యేమియుతడవుకొనక, "రేవఁడా! నీగాడిద యీనిముసమున నీగ్రామమునకు ఈశాన్యఁపు దిక్కున, కొలఁదిదూరమున ఒక్కచేనియందు మేయుచున్నది.

తెల్లవారువఱకది తనంతటతానే కట్టుకొయ్యకడకు వచ్చి చేరును. నీవు ఈషణ్మాత్రమును విచారింపవలదుపొ"మ్మనెను. ఆ మడివేలు మిగుల సంతసించి, యింటికేగెను.

కాని మనజ్యోస్యుఁడెట్లైనను తనమాట నిలుపుకొనఁ దలఁచి రాత్రియందఱును నిదురించినపిమ్మట ఖరాన్వేషణము నకై బయల్వెడలెను. ఆయర్ధరాత్రమున నాచిమ్మచీఁకటి యందు, చెట్టనక పుట్టయనక, కాలికి బలపముకట్టుకొనతిరిగి, తుదకొక్కచోట నాగాడిదనుగాంచెను. ఆతని సంతసమునకు మేరలేదు. తెల్లవారునఱకాగాడిదను తోలుకొని, దానికట్టు కొయ్యకడనిలిపి, యెవ్వరు చూడకుండ తనప్రక్కపైపరుం డెను. తెల్లవారిన పిమ్మట, చాకలి గాడిద వచ్చుటకు మిగుల నబ్బురమంది, యీ విషయము నూరంతయుఁ జాటెను.

దీనితో నాతనిప్రసిద్ధి ఇనుమడించి, యీతనివిషయము కర్ణాకర్ణిని రాజునకుఁగూడ దెలియనయ్యెను. ప్రభువాతని పిలి పించి తనయొద్ద నాస్థాన జ్యోతిష్కునిగ నుంచుకొనెను. ఇట్లు కొంతకాల మేగినపిమ్మట, నాభూపతి యొక్కనాఁడు షికారు నకు వెళ్లుచు, నీ కార్తాంతికునిఁగూడ తనవెంటరమ్మనెను. ఆ తఁడును, నరపతివెంట నేగుచుండెను. వారు కొంతదవ్వేగిన పిమ్మట, నొక్కమిడుత యా భూపతిచేతిపై వ్రాలెను. ఆతఁ డది జ్యోస్యుఁడు చూడకుండ, తనగుప్పిట దాఁచి, "జ్యోస్యుల వారూ! నా చేతియం దేమిగలదో! చెప్పుఁడ"నెను. పాపమా జ్యోతిష్కుఁడు, "ఇంతదనుక నెట్లో బూటకము చేసి పెక్క

చిక్కులు తప్పించుకొని యిట్టిపేరు గడించితినిగదా! ఇప్పుడెట్లు తప్పించుకొనఁగలనని, యేమియు తోఁచక, తనపేరు మిడుతంభొట్లుగాన, "చిక్కేరా! మిడుతంభొట్లు" అనెను. రాజదివిని తనచేతనున్నది జ్యోస్యుఁడు సరిగ జెప్పఁగలిగెనని యెంచి, యాతని ప్రజ్ఞకు మిగుల నానందించి, యాతని వేతనము నినుమడింపఁజేసెను.

## ౨౦. వచ్చినపని వాకిటనే అయినది.

చాలకాలము క్రిందట అయోధ్యారాజ్యమును రఘుమహారాజు పాలించుచుండెను. ఇక్ష్వాకువంశమున నీతఁడు మిగుల ప్రసిద్ధినొందిన చక్రవర్తి. ఈతని నామమును బట్టియే శ్రీరాముని వంశమునకు రఘువంశమనియు, నాతనికి రఘురాముఁడు రాఘవుఁడనియు పేర్లు గలిగెను. ఈ చక్రవర్తి దుష్టశిక్షణమును, శిష్టరక్షణమును మిగుల న్యాయముగ నొనర్చుచు ఈతిబాధలు లేకుండ ధరాపాలన మొనర్చెను.

ఆకాలమున వరతంతువను ఋషీశ్వరుఁ డొకఁడుండెను. ఆసంయమిచంద్రునికడ పెక్కురు ఛాత్రులు విద్యనభ్యసించుచుండిరి. వారియందు కౌత్సుఁడను మునికుమారుఁడు మిగుల ప్రసిద్ధిచెందినవాఁడు. ఆతఁడు తన గురువుకడ మిగుల వినయవిధేయతలతో మెలఁగుచుండెను. మిగుల కుశాగ్ర

బుద్ధియగుటవలన, అలంతికాలమున చతుర్దశవిద్యలయందారి తేరెను. విద్యాభ్యాసము పూర్తియైనపిమ్మట, అతఁడు గురువు కడకేగి "స్వామీ! నావిషయమున మీరు చాల శ్రమపడితిరి. నేను మిగుల కృతజ్ఞుఁడను. మీకెద్దియేని గురుదక్షిణ నొసఁగఁ దలఁచితిని. మీరేమి కోరుదురో చెప్పుఁడ"నెను. ఆ మునీశ్వరుఁడును "నేను ప్రత్యుపకార మపేక్షించి నీకు విద్యగఱపినవాఁడఁ గాను. నీయట్టివారలకు పెక్కురకేను విద్యాదానమొసఁగితిని. ఇట్లు చేయుటయందు నావిధ్యుక్తధర్మ మొనర్చితినిగాని, విశేషమేమియు లేదు. నాకట్టి దక్షిణయెద్దియు నీయనవసరములే"దనెను. శిష్యుఁ డూరకొనక, అదేపనిగ నెద్దియైన కోరుఁడని బలాత్కరించెను. వరతంతునకేమియు దోఁచక "సరియే! నాయొద్ద పదునాల్గువిద్యలు నేర్చితివిగాన, పదునాలుగు కోట్ల రూప్యము లిమ్మ"ని మిగుల విసుగుతో ననెను. అంతే వాసి సమ్మతించి, విద్యోపదేశికునియొద్ద సెలవుగైకొని వెడలెను. కాని, ఆబుషికుమారుఁ డంతధన మెట్లు సేకరింపఁ గలఁడు?

కౌత్సునకుఁ డంతకుమున్న రఘుమహారాజు గొప్ప యాగ మొక్కటి చేయుచుండెననియు, నందడిగినవారికి లేదనకుండ పెక్కుదానము లొనర్చుచుండెననియు, వినియుండెను. వెంటనే యతఁడు బయల్వెడలి అయోధ్యకుఁ జేరెను. రఘుమహారాజు హజారముకడ నిలువఁబడి, ద్వారపాలకునిచే తనరాక నెఱింగించెను.

ఆ సార్వభౌముఁడావఱకే తన సర్వస్వమును యజ్ఞకాలమున భూసురులకు దానమొనర్చెను. ఇంట సువర్ణ కలశాదులుగూడ లేనందున, ఆతఁడీమునికుమారునకు మృణ్మయ పాత్రలతో నర్ఘ్యపాద్యాదులఁ గొనివచ్చెను. కౌత్సుఁడది చూచి, నివ్వెఱపడి సర్వమును గ్రహించి 'వచ్చినపని వాకటనే అయిన'దని వెనుదిరుగ సమకట్టెను.

కాని, వితరణఖనియగు నాచక్రవర్తి, యాతని నిలిపి యతనికోర్కె నెఱింగి, ససైన్యముగ కుబేరునిపై యుద్ధమునకుఁ బోవ బయలుదేరెను. కుబేరుఁడాతని యుద్దేశమెఱిఁగి, ఆతని కోశాగారము లన్నియు ధనమయములుగ నొనర్చెను. ఈఋషి కుమారుని మూలముననే ఇంతధనము గల్గెఁగదాయని, అందు చిల్లిగవ్వయైన తానుంచుకొనక, సర్వము నాతనికే యిచ్చివైచెను. మునిపుత్రుఁడును గురుదక్షిణయొసంగి కృతకృత్యుఁడయ్యెను.

## ౨౧. చెవిటికి సంకూఁదుట.

ఆంధ్రదేశమున జంగములను నొకజాతివారు కలరు. ముఖముపై నుండు విభూతిరేఖలును, మెడయందలి రుద్రాక్ష పేరులును, సందెటఁగట్టఁబడియుండు శివలింగమును, వీరు శివ భక్తులని చెప్పకయె చెప్పును. వీరియందు పెక్కురు ఉదరపోషణము చేసికోలేని బీదలు గలరు. వారికి యాచనయే ముఖ్య

వృత్తి. వీరు సామాన్యముగ శివరాత్రి నెలయందు గ్రామము లవెంట బయలుదేరుదురు.

ఒక్కనాఁడొక జంగము శరీరమునిండ విభూతినలమి, కంఠమున పెక్కు రుద్రాక్షమాలలు వైచి బిక్షాటనమునకు బయలుదేరెను. ఆతఁడు కుడిచేతితో గంటను మ్రోగించుచు, ఎడమభుజముపై వ్రేలుచున్న శంఖమును మధ్యమధ్య పూరించుచు, శివా! మల్లేశా! మహేశా! మొదలగు శివనామముల నుచ్చరించుచు భిక్షకొఱ కింటింటికి దిరుగుచుండెను.

ఇట్లు తిరిగి తిరిగి యాతఁడొక చెవిటివాని యింటికేగెను. ఆబధిరుఁ డరుఁగుపై గూర్చుండి, యాతనివంకఁ జూచుచుండెను. ఆ జంగము చాలకాల మట్లే నిలఁబడెను. ఈతని దీనాలాపములు, ప్రార్థనలు ఆ బధిరునకు వినఁబడుటలేదు. "చెవిటి పెద్దమ్మా! చేదతాడు నిచ్చెదవా! యన్న, మాయమ్మపుట్టినిల్లు బెజవాడ" యనినట్లు, అతఁడేమేమియో ప్రశ్నలువైచుచుండెను. తుదకా జంగము, మామూలుగ తన శంఖమును దీసి, శక్తికొలఁది పూరించుచుండెను. కాని యా చెవిటివాని కాశబ్దము వినఁబడదయ్యె. ఈ జంగమా శంఖమును కొఱుక ప్రయత్నించుచుండెననియెంచి, ఆచెవిటివాఁడు "నీవు చచ్చినను, నీయబ్బచచ్చినను ఆ శంఖము గొఱుక నీ వశమగునా?" యనెను. ఆజంగము కడుపుబ్బ నవ్వసాగెను. తుద కింటిలోని వారెవరోవచ్చి, యాతనికి భిక్షముపెట్టి పంపిరి. మనమెవరికైన

నొక యాలోచన చెప్పినపుడు, వారు దానిని పెడచెవినిఁబెట్ట 'చెవిటికి సంకూదినట్లు' ను సామెత నుపయోగింతుము.

## ౨౨. చినరామన్న పెదరామన్న.

పూర్వమొక గ్రామమున ఇరువురు సోదరులు గలరు. వారిరువురిపేర్లును రామన్న లే. సులభముగఁ దెలిసికొనుటకై జనులు అందు జ్యేష్ఠుని పెదరామన్న యనియు, కనిష్ఠుని చిన రామన్న యనియు, పిలుచుచుండిరి. పెదరామన్న లోకజ్ఞాన మెఱుఁగని మూఢుఁడు. చినరామన్న లౌకికుఁడు; మాయావి. అగ్రజునకు పనిపాటలుచేయు సామర్థ్యముకూడలేదు. కాన ఇంటి యాజమాన్యమంతయు చిన్నవాఁడే జరుపుచుండెను.

వారికి పిత్రార్జితమగు భూవసతి కొంత గలదు. దాని నిరువురుగలిసియే సేద్యము చేసికొనుచుండిరి. ఒకసంవత్సరము చినరామన్నకు, అన్నను మోసగింపవలెననుబుద్ధి పొడమెను, ఆతఁడు అన్నకడకేగి "సోదరా! చేనిలోపైరుపెట్టుటకు అదను వచ్చినది.తరుణము మించిపోయిన విత్తనములు వృథాయగును. నీకీవత్సరము క్రిందిపంట కావలెనా? పైపంటకావలెనా? గట్టిగ జెప్పుము. పిమ్మట పోట్లాట రాకుంటకై ఇప్పుడే నిర్ణయించు కొందమ"నెను.

మూఢుఁడగు అగ్రజుఁడు తనకు పైపంటయే కావలెననెను. అంత తమ్ముఁడు ఆవత్సరము వేరుశెనగపైరుపెట్టెను. అది దినదినప్రవర్ధమానముగఁ బెఱిగి, కొంతకాలమునకు కోఁతకు వచ్చెను. తమ్ముఁడు వేరుశెనగ పీకించి తమ నిర్ణయప్రకారము కాయలన్నియు తాను దీసికొని కట్టెయు కంపయు అన్నకిచ్చెను.

మఱుసటి సంవత్సరము, అన్న తమ్ముని సమీపించి 'తమ్ముఁడా గతవత్సరము పైపంటఁ దీసికొనుటవలన, చాల నష్టము సంభవించినది. ఈయేఁడు నీవు పైపంటఁ దీసికొని నాకు క్రిందిపంట నిమ్మనెను. ఆవత్సరము తమ్ముఁడు చేను పదనగునట్లుదున్ని, తరుణమున మిరపమొక్కలు నాటించెను. అనుదినమును ఆపైరునకు నీరుపోయుచు ప్రాణమొకయెత్తుగ కాపాడినందున, ఆచేను చక్కఁగపండి, కొన్నిపుట్ల మిరపకాయలయ్యెను. కాని వారి నిర్ణయప్రకారము ఆకాయలన్నియు చినరామన్నకును, నిరుపయోగమగు వేరువెల్లంకులు వివేకహీనుఁడగు పెదరామన్న వంతునకును వచ్చెను.

# ౨౩. గుడిపూడిజంగాలు.

గుడిపూడియను గ్రామము తెలుఁగుదేశమున కలదు. ఆయూరియం దుండువా రందఱును జంగములే. వారు భిక్షాటనమువలన జీవనము గడపుకొనుచుందురు. వారు శుష్క్రక్రియములకు మిగుల పేరెన్నికగన్నవారు. సూర్యోదయమునకు మున్న మేల్కాంచి, కాలకృత్యములఁదీర్చికొని, చల్దియన్నము గుడిచి, జోలెయు, శంఖమును గంటయు దీసికొని, తలకొక గ్రామము వెళ్ళుచుందురు. యథాశక్తిని ధాన్యము సేకరించుకొని, యిలుసేరి యెవరిపనివారు చూచుకొందురు.

రాత్రిభోజనములైనపిమ్మట వారందఱు నడువీధిని రచ్చబండకడఁజేరుదురు. నలుగురు చేరినపిమ్మట ఏదియోయొక యాలోచన రాకమానదు. వారచట చేరునదే కాలక్షేపము కొఱకుగాన, ప్రొద్దుపోవుదనుక 'పిచ్చ' 'పాటి' మాట్లాడుకొందురు.

అందొకఁడు "తూర్పువీధిని బొత్తుగ బావియేలేదు. ఆవీధివారందఱు మంచినీటికై చాలయిబ్బంది పడుచుండిరి. తప్పక మనమందఱమును గలిసి, అచట నొక నూయి త్రవ్వించవలె"నను. వెంటనే అందఱును దాని నామోదించి "తప్పక రేపటి యుదయమే యీపని ప్రారంభింపవలె"నందురు.

అంతట మఱియొకఁడు "మనయూరఁగల సత్రము చాల కాలమునుండి అనాదరింపఁబడుటవలన శిథిలమై యున్నది. బాటసారులకు మిగుల ఇబ్బందిగ నున్నది. దానినిసరిచేయించవలె"

ననును. తత్క్షణమే యెల్లరును ఆపని జరిగితీరవలసినదే, రేపే ప్రారంభింపుఁడని ఏకగ్రీవముగ పల్కుదురు.

ఇట్లు మాట్లాడుకొని, ఇండ్లకేగి నిదురింతురు. మరునాటిరేపకడ నిదురలేచి, జోలెతగిలించుకొని యెవరిదారిని వారు వెడలుదురు. రాత్రి సల్పిన యాలోచన లొక్కఁడును గమనింపఁడు. మరల మరుసటిరాత్రి యట్లే గుమిగూడి మంతనము లాడికొని ఉదయము కాఁగనే యూరికొకఁడు వెడలును. ఇట్లనుదినమును పగలంతయు భిక్షాటనమును, రాత్రి ప్రొద్దుపోవుదనుక ధర్మకార్యనిర్వహణవిషయికమైన ఆలోచనలును సల్పుచుందురు.

కాన కొందఱేదైన పని సేయ నమకట్టి, అది యెప్పటికిని ప్రారంభింపక, ఎవరిపని వారు జూచుకొనుచున్న, వారిని, 'గుడిపూడిజంగా'లని పిలుచుట వాడుక.



## ౨౮. మక్కికి మక్కినకలు.

ఒకానొక ధనికునొద్ద ఒక వ్రాయసకాఁడు గలఁడు. ఆతఁడు శరీరమును దాఁచుకొనక కష్టపడి పనిసేయువాఁడు. వ్రాఁతపని యెంతయైనను విసుగులేక చేయువాఁడు. తన యజమానుఁడు చెప్పినపనియం దేమి లోపము వచ్చునో! యని సదా జాగరూకతతో మెలంగెడివాఁడు. కాని పాప మాతనికి తెలివితేటలు శూన్యము.

ఒకనాఁడా ధనికుఁడు తన వ్రాయసకాని చేరఁబిలచి "నేను నీకీపుస్తకము నిచ్చెదను. దానికి నీవు సరియగు నకలును తయారు చేయవలెను. జాగ్రత్తసుమా! ఇందెట్లున్నదో అందును అట్లే వ్రాయవలె" నని చేతికొక గ్రంథము నిచ్చెను. ఆతఁడా పుస్తకమును తీసికొని వ్రాఁతపని ప్రారంభించెను. కొలఁది దినములు కష్టపడి నకలు సిద్ధము చేసెను. మూలము నందెన్ని పుటలుగలవో? ఇందును అన్నియే యుండెను. మాతృకయందు పుటకెన్ని పంక్తులు గలవో? ప్రతికయందును అన్నియే కలవు. అసలునందు పంక్తి కెన్ని పదములు గలవో? నకలునందును అన్నియే కన్పట్టు చుండెను.

ఇట్లు సర్వమును 'తూ' 'చ' తప్పక యథామూలముగ సిద్ధ మొనర్చెను. తాను జేసినపని సరిగ నున్నదో లేదో అని మరల నొకసారి ఆమూలాగ్రముగ పరికింపఁదలఁచెను. ఇట్లుసరి చూచుట కారంభించి, మూలమునందు కొన్ని పత్రములు త్రిప్పునప్పటికి, ఒకపుటయం దొకమూల నొక యీఁగ చచ్చి యంటుకొని యుండెను. ఆఁ! పొరపాటు దొరకెనుగదరా! అను కొనెను. తత్క్షణమే నకలునందు సరిగ అన్నవపుటయందే అన్న వబంతికడనే యొకయీఁగను చంపి అంటించెను.

అంత నా పుస్తకద్వయమును తనస్వామికడకుఁ దీసికొని పోయి చూపించెను. ఆతఁడును నకలునందు పుటలు త్రిప్పు చుండ, నీయీఁగ నంటించినకడ కాగితము మలినమై, అసహ్యముగ కన్పట్టెను. తత్క్షణమే యజమానుఁడు వ్రాయసకానిఁ

బిలిచి 'ఈకాగిత మిట్లేల అపరిశుభ్రముగ నున్న?' దనెను. ఆతఁడు 'స్వామీ! అది నాతప్పుకాదు. మూలగ్రంథమున నచట నొక మక్షికము చచ్చి అంటుకొనియున్నది. తాము నకలునం దెట్టిమార్పును నుండవల దంటిరి. అది కారణముగ నిట్లొనర్చితి' ననెను. యజమానుఁడు ఆతని అప్రమత్తతను శ్లాఘించినను తెలివితక్కువకు మిగుల విచారించెను. ఇట్లు తెలివితక్కువగ నెవ్వఁడైన మూలానుసరణ మొనర్చిన నది 'మక్కికి మక్కి' న కలని చెప్పుదురు. ఉర్దు భాషయందు మఖి యన ఈఁగ యని యర్థము.



## ౨౫. నూటికిసర్దారు.

ఒకానొక కుగ్రామమున ఒకసాలెవాఁడు గలఁడు. ఆతఁడు తన కులవృత్తిచే కుటుంబపోషణ మొనర్చుకొను చుండెను. తంతుకారులు వస్త్రములు నేయునపుడు దగ్గఱ గంజికుండ నొకదాని నుంచుకొనుట అలవాటు. ఆతఁ డొకనాఁడు మగ్గముకడ నాసీనుఁడై తన గంజికుండవైపు చూచెను. దానిపై నసంఖ్యాకములగు నీఁగలు మూఁగెను. ఆతఁడు తన రెండుచేతులను దూరముగ సాచి యొక్కసారి చఱచెను. ఆ యీఁగలన్నియు నాతని కరద్వయముమధ్య నలిగి చనిపో యెను. ఆ సాలెవాఁడు వానినన్నిటిని లెక్కిడ అవియొక వంద

యుండెను. ఒక్కసారి నూఱుప్రాణములు తీయఁగలిగిన తన పరాక్రమమునకు తాన యుబ్బురపడి, 'నూటికిసర్దా'రని పేరు పెట్టుకొనెను. తానొక గొప్ప బలాఢ్యుఁడ నైతినని యెంచి, తన కులవృత్తిని మానెను.

అతఁ డుత్తరక్షణముననే సకుటుంబముగ రాజధాని పట్టణమునకు వెడలెను. అచట నెవరైన నీపేరేమని యడిగిన 'నూటికిసర్దార'ని చెప్పుచుండెను. ఆయూరివా రందఱు, ఈతఁడు మిగుల బలశాలి యనియు, నూఱు మందిని నొక్కసారిగ చంపఁ గలఁడనియు తలఁచుచుండిరి. ఈతని విషయము రాజునకుఁ గూడ కర్ణాకర్ణిని తెలియనయ్యెను. ఇట్టి యవక్రపరాక్రమ వంతుఁడు తన కొలువుననుంట మిక్కిలి యవసరమని యెంచి, యాతని బిలిపించి తన యాస్థానము నందుంచుకొనెను.

కొంతకాలమునకా నగరప్రాంతముల నొక యెలుఁగు బంటి దిరుగాడఁ జొచ్చెను. పురజనులు భయఁపడి, ఆవృత్తాంతమును నరపాలునకెఱింగించిరి. రాజు తన క్రొత్తసర్దారును బిలిచి, యా భల్లూకమును సంహరింపుమని, ఆజ్ఞాపించెను. ఆతఁడు రాజుమోల్ల నట్లే యని ఒప్పుకొనెను. ఇంటికేగి యీ వృత్తాంతమును భార్యతోఁ జెప్పెను. రాజుచేతనో భల్లూకముచేతనో తన చావు నిశ్చయమని యెంచి భార్యతోఁగూడ పయనమయ్యెను. ఆ యెలుఁగు సంచరించెడి ప్రదేశమునకు పోవుచుండెను. మధ్యేమార్గమున, ఆతనికొక తాళవృక్షమును దాని యగ్రమున నొక కల్లుకుండయుఁ గన్పట్టెను. ఎట్లును భల్లూకముచే చావు నిశ్చయముగాన సంతృప్తిగ మద్యము

త్రావినయెన చచ్చెదనని యెంచెను. భార్యను కొంతదిదూర మువనుంచి, తా నావృక్షము నారోహించెను. మద్యభాండ మును విప్పి యందలి మద్యమును గట గట త్రాగుచుండెను.

ఇంతలో నా భల్లూకము వృక్షమూలమును జేరి తలపై కెత్తి కాండమ్రమని యాఱచెను. మన సర్దారు భయముచే గడ గడ వడఁక మొదలుపెట్టెను. అట్లు వడఁకుచుండ, నాతని మొలనున్న ఖడ్గము దైవవశమున జారి, తెఱచియున్న యా భల్లూకము నోటఁబడి గ్రుచ్చుకొన, అది మరణించెను. ఆతఁడును భయముచే పట్టువదలి క్రిందపడెను. కొంతవడి కతఁడు లేచి చూడ నెలుఁగుబంటి మరణించియుండెను. ఆసర్దారు తన ఖడ్గమును తీసికొని, తన యదృష్టమునకు తానే ఆనందించు కొనుచు సకుటుంబముగ ఊరుజేరి, భూపతికడకేగెను. 'భల్లూకమును జంపితి. భటులనంపి, యా కళేబరమును దెప్పింపుఁ' డని సగర్వముగఁ బల్కెను. రాజ ట్లొనరించి, ఆతని సాహస కృత్యమునకు మిగుల యానందించి, అతనికి వేతనాభివృద్ధి యొనర్చెను.

మఱికొంతకాలమున కాప్రాంతముల కొకపులి యరు దెంచెను. జనులు భీతిల్లి నృపతి కెఱుకపఱచిరి. ఆతఁడును దానిని మట్టుపెట్టుమని యీసర్దారును నియోగించెను. ఆబలా ఢ్యుఁడు మరల తన మరణ మాసన్నమైనదని, అట్లే సకుటుంబ ముగఁ బయనమయ్యెను. ఇట్లుపోవుచు నారాత్రియొక గొఱ్ఱెల మందకడకేగెను. ఆమందకాపరి అప్పుడే 'పులి గిలి వచ్చునేమో

చూచుచుండు'మని తనసహచరునకుఁ జెప్పి యెటకో వెడలి పోయెను. చేరువ నున్న వ్యాఘ్రము మామాటలువినెను. కొంత తడవునకు మందయందుఁజేరెను. మనసర్దారు 'ఎట్లునుచావఁ బోవుచుంటిని. కమ్మని గొఱ్ఱెమాంస మైన తిని చచ్చెద'నని, ఆమందయందొకగొఱ్ఱెను తీసికొనఁదలఁచెను. మందయందు ప్రవేశించి యేది బలాఢ్యమైన గొఱ్ఱెయోయని వీపులపై తడవుచుండెను. ఇట్లుచేయుచు నందున్న వ్యాఘ్రమునుగూడ తడవెను. ఆమువ్వన్నె మెకము తా నింతకుమున్నువిన్న గిలి యిది యేయనియెంచి, అది తన్నెచ్చట చంపిపోవునోయని భయఁపడి, కదలక మెదలక అట్లేయుండెను. సర్దారుచేతికి వ్యాఘ్రముఁపు శరీరము మెత్తగఁ దగుల, 'నిదియే బలసినగొఱ్ఱె'యని యెంచి చెవిఁబట్టి లాగుకొనిపోయి,చేరువనున్న యొకవృక్షమునకుఁ గట్టివైచెను. ఆతఁడు గొఱ్ఱె యెట్టిదో చూతమని నిప్పుపుల్లవెలిగింప, ఆమనుజుని జూచి యది, కాంద్రుమనెను. అంత నతఁడు రాజుకడకేగి 'శార్దూలమునుబట్టి చెట్టునకుఁగట్టితి'నన, నాభూపతి 'దానిని గుండెపెట్టి కాల్చిరమ్మ'నెను. ఆతఁ డెన్నడును తుపాకిని చేతఁబట్టి యెఱుఁగఁడు గాన 'నేనుబంధించిన జంతువును నేనే చంపుట పాడిగాదు. కట్టివైచినదానిఁ జంపు టెంతపని? ఎవరినైనఁ బంపుఁడు. చంపు'ననెను. నరపాలుఁడట్లేయొనర్చెను.

కొంతకాలమునకు శత్రురాజొక్కఁడీ భూపాలునిపై దండెత్తి వచ్చెను. రాజు సర్దారుని శత్రుసైన్యముల మడియించి రమ్మనెను.గుఱ్ఱపుసాల కడకేగి నీయిచ్చవచ్చిన గుఱ్ఱము నేరుకొమ్మనెను. ఎన్నడును గుఱ్ఱపుస్వారి యెఱుంగని యాతఁడు,

మిక్కిలి బలహీనమగు నొక్క చిన్నగుఱ్ఱము నేర్చికొనెను. కాని అన్నిటికంటె నదియే శ్రేష్ఠతమమగు గుఱ్ఱము. అంత నతఁడు దానివీపుపై నెక్కి, తన్ను త్రాళ్లచే గట్టిగ బంధింపుఁడనెను. సేవకులట్లు యొనర్చిరి. అతఁడా యశ్వమును 'ఛీ' యని యదలింప, నది వాయువేగమునఁ బరువెత్తసాగెను. సర్దారునకు కన్నులు తిరిగి గుండెలు పగులుచుండెను. ఇట్లు పోవుచు నది చేరువనున్న రెండుతాటిచెట్ల మధ్యను బోవ తటస్థించెను. ఇంతదనుక ప్రాణములపై నాశ వదలుకొనిన యారౌతు, ప్రాణరక్షణము చేసికొనఁదలఁచి, యాచెట్లరెంటిని రెండుచేతులతో కౌఁగిలించుకొనెను. ఆయశ్వవేగమున నాచెట్లురెండును పెల్లగిలి, ఆతని చేతులలో నిరికికొనెను. తురగమట్లే మనోవేగమున పరువెత్తుచుండెను. పరసైన్యములు ఈదృశ్యముఁ జూచి యీబలాఢ్యుఁ డెవ్వఁడో, తాళవృక్షములతో యుద్ధముఁజేయ వచ్చుచున్నాఁడని యెంచి, చెల్లాచెదరై పలాయితములయ్యెను. అశ్వము, తిరిగి తిరిగి మరల గుఱ్ఱఁపుశాలకడకేగి, తనకట్టుకొయ్యకడ నాగెను. భటులు కట్లువిప్ప, నాతఁడు గుఱ్ఱము దిగి, శత్రుసైన్యముల బాఱఁదోలితినని ప్రభున కెఱుకపఱచెను. ప్రభువానందించి యాతని బహూకరించెను.



# ౨౬. నవాబుదర్బా.

ఒక నవాబునొద్ద నలుగురు మంత్రులుండిరి. అందొకఁడు అద్వైతి. మఱియొకఁడు విశిష్టాద్వైతి. మూఁడవవాఁడు ద్వైతి. నాలవవాఁడు మహమ్మదీయుఁడు. కాన నలుగురు మంత్రులును వివిధమతావలంబకులై యుండిరి.

అద్వైతులు అడ్డబొట్లును, విశిష్టాద్వైతులు ఊర్ధ్వ పుండ్రములును, మధ్వులు నల్లని నిలువుబొట్లును ధరింతురు. మహమ్మదీయులకు అసలు బొట్టే గిట్టదు. త్రివిధ మతములవారును అనుదినము ఒకరి బొట్లును జూచి ఒకరు ఎగతాళిచేసికొనుచుండిరి. నాలవవాఁడగు మహమ్మదీయమంత్రి " పరిశుభ్రమగు మీ మోముల నిట్లేల వికారమొనరించుకొందు?"రని మువ్వురను తూలనాడుచుండెను. వారుమువ్వురును "బొట్టులేని మొగమేమి మొగము?. సానవలె నున్నగ నుండు"నని యాతని పరిహాసమాడు చుండిరి. క్రమముగ నదియే మతవిషయికమగు కలహమునకు దిగి నవాబునకుఁగూడ తెలిసెను. సమయము దొరికినపుడెల్ల మహమ్మదీయమంత్రి నవాబునకు వీరిపై కొండెములు చెప్పుచుండెను.

ఇట్లుండ ఒక్కనాఁడు ముక్కోటి ఏకాదశి వచ్చెను. హిందూమంత్రులు మువ్వురును నాఁడుపవసించి మఱునాటి రేపకడ ద్వాదశీపారణఁ గానిచ్చిరి. వైష్ణవమంత్రి తెల్లని వంగ నామములు ముఖమునిండ తీర్చెను. అద్వైతమంత్రి మోము

నకడ్డముగ విభూతి నలమి దానిపై గంధమును మెత్తి దానిపైని రూపాయి వెడల్పున కుంకుమ పట్టించెను. మధ్వమంత్రి నల్లని నిలువుబొట్టును వెడల్పుగ తీర్చి కణతలకును కన్నులక్రిందను గంధము నలమెను. మొత్తముమీఁద అనుదినము పెట్టువాని కంటె దిట్టముగ బొట్లుతీర్చి ముఖ్వరును ఆస్థానమునకేగిరి. మహమ్మదీయ మంత్రి కీదృశ్యము వలన అరికాలుమంట నెత్తికెక్కెను.

వీరుముఖ్వరు తనను, నవాబును, తనమతమునుకూడ ఎగతాళిచేయుటకై యిట్లు మోము లలంకరించికొనిరని తత్క్షణమే నవాబుకడకేగెను. "ఈ మంత్రులు మనకొలువు చేయుచు మనమతమును పరోక్షమున ద్వేషించుటయేగాక, నేఁడు తమ ద్వేషభావమును సమక్షముఁ గూడ చూపనెంచిరి. వారి ముఖములు గాంచిన మీకు విశదమగు"ననెను. 'వినినమాటల కంటె చెప్పుడుమాటలు చేటు' గాన నవాబు తొఁకత్రొక్కిన తాచువలె మండిపడి ఉత్తరక్షణముననే కొలువున కేతెంచెను.

రాగనే వైష్ణవమంత్రిని పిలిచి 'నీముఖమున పొడవుగ తెల్లగ కన్పడు నామూఁడురేఖలేమి?' యని ప్రశ్నించెను. 'స్వామీ! ఏమియులేదు. ఇది మీపీరుయొక్క చిహ్నము. మీఁడప్పటిని జీవించువాఁడఁగాన మీరుపూజించు పీరుయొక్క చిహ్నమును ఇట్లు ముఖమున ధరించితి' ననెను. నవాబు సంతసించి 'అచ్ఛా' యనెను. పిమ్మట స్మార్తుఁడగు మంత్రినిపిలిచి 'నీముఖమున అడ్డముగ కన్పడునది ఏమి?' నిప్రశ్నించెను. 'ఇది

వేఱొండేమియుకాదు. మీరు పూజించు పీరున కడుగు భాగ మునసునుఁడు పీర' మని అతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. నవాబు 'శహబాష్' అని శ్లాఘించెను. పిమ్మట మధ్వమంత్రిని పిలిచి 'నీమోముపై నల్లగ పొడవుగ గన్పడు నా యొంటిరేఖ యేమి? ఈవలావల నా తెల్లని సున్న లేమి?'యనెను. ఆతఁడేమియు తడవు కొనక 'ఇది మీపీరునకుపైనఁగట్టు జండాయొక్క చిహ్నము. దీనిని మిగుల భక్తిపూర్వకముగ ముఖమున సలంకరించితి' ననెను. పాపమా నవాబు వారిమాటలునమ్మి 'అచ్ఛా! బాగున్నది. మీరెప్పుడును ఇట్లే ధరించుచుండుఁ' డనెను. నేఁడు వీరికేదియో గొప్పశిక్ష సంభవించితీరునని ఉవ్విళు లూరుచున్న మహమ్మదీయమంత్రి మొగము చిన్నబుచ్చు కొనెను. నవాబుదర్జా యాన నిట్టిదియే.

## ౨౭. గుడ్డిదర్బారు.

కృష్ణామండలమున కొండపల్లి యను గ్రామము కలదు. ఇందు పూర్వము రెడ్డిరాజులు పరిపాలించిన చిహ్నము లిప్పటికిని గలవు. కొలఁదికాలము క్రిందట ఈగ్రామమున ఒక బ్రాహ్మణుఁ డుండెను. ఆతఁ డాఱువేల నియోగి. మిగుల బుద్ధిసూక్ష్మత గలవాఁడు. ఆతనికి పిత్రార్జితమైన భూవసతి

కొంత గలదు. అతఁడు స్వయముగనే వ్యవసాయము చేసికొను చుండెను.

ఒక సంవత్సరమా విప్రునకు ఒక చేనియందు దోసకాయలు మెండుగ కాచెను. అతఁడు వాని నన్నిటి నొక బండిపై వైచికొని అమ్ముకొనుటకై నిజామురాష్ట్రమున కేగెను. సరాసరి హైదరాబాదు పట్టణము చేరెను. నడువీధియందు తన బండిని దింపుకొనెను. దింపుటయే తడవుగ ఒక మహమ్మదీయుఁడువచ్చి ఆ దోసకాయలను చూచెను. బ్రాహ్మణుని ఒక చెంప దెబ్బవైచి తనకు కావలసినన్ని దోసకాయలను తీసికొని వెళ్ళెను.

కొంత తడవునకు ఇంకొక తురుష్కుఁడు వచ్చి అట్లే యొనర్చెను. ఇట్లొక గంటకాలమున నాతని బండిలోని కాయలన్నియు నిశ్శేషము లయ్యెను. అగుటయేగాక ఆతని దవుడలు బూరెలవలె ఉబ్బెను. పాప మాతనిమొర వినువారు లేరైరి. ఎవరికి చెప్పుకొందమన్నను వానిగోడు విచారించువారే కనబడరైరి.

ఆతఁ డిదియంతయు అచటి పరిపాలనామాహాత్మ్య మని గ్రహించెను. ఈ ప్రభుత్వమున ఎవ్వరేమి యొనర్చినను చెల్లుబడియగునని తలఁచెను. వెంటనే తన బండిని ఎద్దులను ఏ కొలఁది రూప్యములకో అమ్ముకొనెను. ఆ సొమ్ముతో ఉద్యోగికి తగిన కొన్ని దుస్తులను, ఒక కుర్చీయును, ఒక బల్లయును, కొనెను. కొంత వేతన మిచ్చెదనని ఒక నౌకరిని కుది

ర్చెను. ఆతనికి సర్కారు నౌకరికివలె మెడయందొక డవాలు నేర్పఱచెను.

ఆయూర నొక మంచినీటి తటాకముగలదు. ఉదయముననే ఈ బ్రాహ్మణుఁడు తన దుస్తుల నలంకరించుకొని నౌకరిచే కుర్చీయును బల్లయును పట్టించుకొని ఆచెఱువుగట్టుపై చేరెను. అచట తన కచ్చేరిని స్థాపించెను. ఒక చెక్కపై 'అంధేకు దర్బార్ తేరాముసద్దీ' అని చెక్కించి అచట నమర్చెను. ఒక్కొక్క మంచినీటిబిందెకు కాని, కావడికి రెండు కానులు, పీపాకు అణా చొప్పున నీటిసుంకము వసూలుచేయ మొదలుపెట్టెను. ఇట్లనుదినము చేయుచున్నను 'అదియే' మని ఎవ్వరును అడుగరైరి.

ఆతఁడచటి పరిపాలనాతత్వమును పూర్తిగ గ్రహించినవాఁడై తన కచ్చేరిని అంగడివీధికి మార్చెను. అచ్చట దుకాణమునకు రూపాయివంతున ప్రతిదినమును వసూలుచేయుచుండెను. ఇట్లు వందలకొలఁది ధనము గడించెను. అప్పటికిని ఎవ్వరును కనుఁగొనరైరి.

ఇట్లు కొంతకాలమొనర్చి తనకార్యాలయమునున వాబు ద్వారము కడకు చేర్చెను. నవాబు దర్శనమునకై వచ్చెడి రాకుమారులు, జమీందారులు మొదలైనవారికడ వందలకొలఁది ధనము బహుమానముగ గ్రహించుచుండెను. అప్పటికిని ఆతని నెవ్వరును 'నీవెవఁడ' వని ప్రశ్నింపరైరి. ఒకదినమున నవాబు బావమఱది యొకఁడు లోనికి ప్రవేశించుచుండ

నీబ్రాహ్మణుఁ డడ్డుపెట్టి బహుమాన మడిగెను. ఆతఁడు 'నీహోదాఏ' మని ప్రశ్నింప నా బ్రాహ్మణుఁడు 'అంధేకు దర్బార్, తేరాముసద్దీ'యని చెప్పెను.

ఆతఁడు వెంటనే పోయి నవాబున కీ విషయమును ఎఱుక పఱుప నవాబు భూసురుని పిలిచి విచారింప మొదలు పెట్టెను. ఆవిప్రుఁడు తన కథనంతను ఆమూలాగ్రముగ విని పించి 'అంధేకు దర్బార'న 'గుడ్డిదర్బారనియు' 'తేరాముసద్దీ' యన 'పదమూఁడవ గుమస్తా' యనియు చెప్పెను. నవాబు తన పరిపాలనయందలి లోపమును గ్రహించి సిగ్గుపడి 'అంధేకు దర్బార'ను బిరుదమును తీసివైచుకొని 'తేరాముసద్దీ' యను పదవితో తన యాస్థానము నందుండు మని ఆబ్రాహ్మణుని వేఁడుకొనెను. ఆతఁడందుల కంగీకరించెను. ఆవఱకు నవాబు కొలువునందు పండ్రెండుగురే గుమస్తాలనియు నాటినుండి నేటి వఱకును పదముగ్గురు గుమస్తాలుందురనియు ప్రతీతి కలదు.

సంపూర్ణము.



# ప్రబంధోపకథావళి.



ద్వితీయముద్రణమునకు సిద్ధముగనున్నది. ప్రధానోపాధ్యాయులచేతను, తదితరులచేతను ప్రొగడ్తగాంచినది. పాఠ్యగ్రంథనిర్ణాయికసభవారిచే నామోదింపఁబడినది. కథలన్నియు విష్ణు, శివ భక్తి ప్రతిపాదకములు. శైలి నాతికఠినము. పాండురంగాదిక్షేత్ర మాహాత్మ్యము లిందు దిఙ్మాత్రము వర్ణింపఁబడినవి.

వెల రు. **0-8-0** మాత్రము. త్వరపడుఁడు.

చిం॥ శే॥ రావు,
గ్రంథకర్త.

వలయువారు:—

ఉభయభాషాప్రవీణ,

## చింతలపూఁడి శేషగిరిరావు,

అసిస్టెంటు,

ఎడ్వర్డు బోర్డు హైస్కూలు,

పొన్నూరు.

(గుంటూరుజిల్లా.)

*Copies can be had of:-*

Ubhayabhashapraveena,

Chintalapudi Seshagiri Rao,

Assistant,

**EDWARD BOARD HIGH SCHOOL,**

**PONNUR.**

